# నలదమయంతుల కథ

(కలిదోష నివారణకు పారాయణ గ్రంథం)






వచన రచన :

శ్రీ జయంతి సుబ్రహ్మణ్య శాస్త్రి
M.A., B.Ed.



రోహిణీ పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్, రాజమండ్రి-1.

# నలదమయంతుల కథ

శ్రీ జయన్తి సుబ్రహ్మణ్యశాస్త్రి



రూ : 25/-



డిసెంబర్ : 1998

ముఖచిత్రం : బాలి

ప్రచురణ :
రోహిణి పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్, రాజమండ్రి-1.
Ph. No. 73444

ముద్రణ :
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-2. ఫోన్ : 431422

# పీఠిక

## నిత్యం పారాయణ చేయాల్సిన పవిత్ర ప్రణయ జీవనగానం

# నలదమయంతుల కథ

"పురుషులందు పుణ్యపురుషులు వేరయా అన్నట్లే"- పుస్తకాలలోకూడా పుణ్యం—పురుషార్థం కలిగించే పుస్తకాలు వేరే వుంటాయి.

అటువంటి పవిత్రమైన పుస్తకాలను మాత్రమే ప్రచురించడానికి బద్ధకంకణులైన "రోహిణి పబ్లికేషన్స్" వారు ముద్రించిన పుస్తకం ఇది. ప్రచురణ కర్తలకు అభినందనలు.

ముఖ్యంగా ఈ నల దమయంతుల ఇతివృత్తాన్ని గురించి నాలుగుముక్కలు వ్రాయడానికి నియంత్రించబడ్డాను.

1. జనాభా వున్నంతకాలం "యావతరం" వుంటుంది. యవ్వనం వున్నంతకాలం నిత్యస్మరణీయులైన లోకోత్తర ప్రేమికులే నలదమయంతులు.

2. ప్రేమకోసం ఎంతకయినా తెగించిన అమ్మాయిలు మన భారతదేశంలో నలుగురు ప్రసిద్ధులున్నారు. వారిలో మొదటావిడ శకుంతల. ప్రపంచం మొత్తంలో "లవ్ లెటర్" అనే దానికి నాంది పలికిన పిల్ల ఈమె. రెండవది రుక్మిణి— తన ప్రియుడైన కృష్ణుడికి సరాసరిని రాయబారం పంపి తనను అపహరించుకు పొమ్మని మన్నదీ మదవతి. మూడవది సావిత్రి—తను ప్రేమించినవాడు అల్పాయుష్కుడనీ, అందునా పెండ్లి జరిగిన అతి స్వల్పకాలంలోనే మరణిస్తాడనీ తెల్సినా కూడా తన ప్రేమతో పసుపు కుంకాలు నిలుపుకోగలనని ప్రతిజ్ఞా పూర్వకంగా చెప్పి, మనసుపడిన వాడినే మనువాడిన మహత్తర యువతి ఆవిడ. ఇక నాలుగవ బాలామణే దమ

యంతి—నలుణ్ని వరించింది. అతనికోసం ఇంద్రాది దేవతల్ని సైతం తిరస్కరించింది. వాళ్ళ మాయల్ని భేదించి మరీ ప్రియుణ్ని వివాహమాడింది.

ఇక నలుడు—

"ప్రేమ త్యాగాన్ని కోరుతుంది" అనే "డైలాగు" ఈ రోజుల్లో "ఫ్యాషన్" అయిపోయింది. ఇది యదార్థ త్యాగమూర్తుల కన్నా—"ఎస్కేపిస్టు"లకు బాగా వుపయోగ పడుతుంది. కాని నిజానికీ డైలాగుకి మూల స్తంభం నలుడు.

ప్రియురాలి శ్రేయస్సు కోసం తనకన్నా ధనికుల్నో, మరొకళ్ళనో పెళ్ళి చేసుకోమనడం — అందుకామెను ఒప్పించడం కోసం శాలువాలు వగైరా కప్పుకోవడం, దగ్గడం లాంటి జబ్బులు నటించడం మనం ఇప్పుడు చూస్తున్నాం.

కాని నలుడు ఆ రోజుల్లోనే తన ప్రియురాలైన దమ యంతిని కలిసి దేవతలను పెళ్ళాడవలసినదిగా సలహా ఇస్తాడు.

దమయంతిమీద మనసుపడ్డ దేవతలు దిక్కారిదీనులై, ఆమెను పొందడం కోసం తమ తరఫున కుంటెనగాడిగా నలుడిని నియమించారు. దేవతా ప్రీత్యర్థం నలుడు తన ప్రియురాలి దగ్గరకు వెళ్ళి వాళ్ళ సందేశాన్ని వినిపించాడు. అయినా దమయంతి నలుణ్ని తప్ప ఇతరుల్ని వరించలేదు.

ఇక్కడ దమయంతి దేవతలని తిరస్కరించడం ప్రత్యక్ష విషయం కాగా,నలుడుకూడా దేవతలని ఎదిరించడం పరోక్ష విషయం.తన ప్రేమవిషయంలో దేవతలనికూడా లెక్కచేయ నంతటి ధైర్యశాలిగాబట్టే నలుడు స్వయంవరానికి వెళ్ళడం, దమయంతీ వరణాన్ని అంగీకరించడం జరిగాయి.

కాబట్టి ప్రేమికులు ఆత్మస్థయిర్యం కోసం నిత్యం మననం చేయాల్సిన కథ యిది.

విషయంలోకి వస్తే దాయలచేత దగాపడ్డ ధరాపాలుడి దయనీయ చరిత్రగా నలకథని కొందరు చెబుతూంటారు.

నిజానికది నిజం కాదు.

నలదమయంతుల ప్రేమకు దేవతల పక్షాన కలి పురుషుడు, ఏల్నాటి శని, సర్పశ్రేష్ఠుడయిన కర్కోటకుడు, ధర్మశీలియైన మహారాజు ఋతుపర్ణుడూ కలిసి ఏర్పరచిన పరీక్షే తప్ప మరొకటి కాదు.

అందువల్లనే— శ్లో॥ కర్కోటకస్య నాగస్య...... ఇత్యాది శ్లోకాలు ప్రచారమయ్యాయి.

అంతేకాదు.

సంశయ శృంగారం, సంయోగ శృంగారం, వియోగ (విప్రలంభ) శృంగారం పునస్సంగమ శృంగారాలతో నిత్య నూతనంగా విరాజిల్లుతూ మళ్ళీ మళ్ళీ చదివించే చరిత్ర ఇది.

ఇంతేకాకుండా ఈ నలదమయంతుల కథను ఒక నెల పాటు చదివిన స్త్రీలకు శాశ్వత సౌభాగ్య, సత్సంతాన సిద్ధి—

పురుషులకు—వృత్తి వ్యాపార-ఉద్యోగాభివృద్ధి ఫలితంగా చెబుతున్నారు.

విద్యార్థులకు విద్య, అవివాహితులకు వివాహం, ప్రేమికులకు సత్ సమాగమం, దంపతుల మధ్య అనుకూల దాంపత్యం, సమస్త దారిద్ర్యాలూ నశించి సర్వ సంపత్ సమృద్ధీ కలగడం వంటి ఎన్నో సత్ఫలితాలు చెప్పబడ్డాయి. అంతేకాదు, ఈ నలదమయంతుల కథను నిత్యం పారాయణ చేసేవారికి దేవదత్తాలయిన వరాలిలా వున్నాయి.

నాగరాజు కర్కోటకుడిచ్చిన వరం : నలరాజా! ఎవరైతే నీ కథను మండల (ఒక నెల) పారాయణ చేస్తారో, వారికి మా పాముల వలనగాని, మరే ఇతర విషప్రాణుల వలనగాని ఎటువంటి విపత్తులూ కలగవు.

అగ్ని ఇచ్చిన వరం : నలభూపాలా! నిత్యం నీ కథను మననం చేసేవాళ్ళు నా కృపకు పాత్రులవుతారు. మండల (ఒక నెల) పారాయణ చేసేవాళ్ళకు నా వలన (అగ్ని) ప్రమాదాలు సంభవించవు.

కలి పురుషుడు : నిషధేశ్వరా! నిన్ను స్మరించిన వాళ్ళ కలి దోషాలు సర్వం తొలగిపోతాయి.

శనీశ్వరుడు : నల చక్రవర్తీ! ఎవరు నిన్ను స్మరిస్తారో వారు నా భక్తులవుతారు. నీవలె ఓరిమి వహించిన వాళ్ళు నాయొక్క సమస్త పీడలనుంచీ విముక్తులవుతారు.

ఇంద్రాది దిక్పాలకులు ఇచ్చిన వరం : ఓ నలదమయంతులారా! లోకోత్తర ప్రేమిక దంపతులైన మీ కథను నిత్యం పఠించే వాళ్ళకు మా దిక్పాలకులం ఎనిమిదిమందీ రక్షకులుగా నిలుస్తాం-అదీ విషయం! మనం శ్రద్ధాసక్తులతో చదవాలేగాని అటువంటి గొప్పవాళ్ళ వరాలు వృథాపోవు.

ఇక చదవడం మనదే ఆలస్యం!

ఒక నెలపాటు పారాయణచేసి చూడండి.

ఫలితం మీకే తెలుస్తుంది!

సర్వేషాం స్వస్తిర్భవతు

సర్వేషాం శాంతిర్భవతు

సమస్త సన్మంగళాని భవంతు.

- రచయిత

# మా ప్రతిష్ఠాత్మక ప్రచురణలు

★ "ఆంధ్రా షేక్స్పియర్"
పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి
శృంగార, హాస్య నాటకములు :
**కంఠాభరణం, రాధాకృష్ణ, కోకిల, విప్రనారాయణ.**

★ లక్ష్మీప్రసన్నం కొఱకు సంస్కృతంలో వెంకటాధ్వరి విరచిత గ్రంథం
"అష్టలక్ష్మీ సహస్రమ్"కు
ఆంధ్రానువాదం
**"అష్టలక్ష్మీ ప్రసన్నం"**

★ నవ్యాంధ్ర సాహిత్య నిర్మాత
శ్రీ కందుకూరి వీరేశలింగంచే
బాలబాలికల కొఱకు రచించబడిన కథలు
**"నీతి కథా మంజరి"**

★ పరవస్తు చిన్నయసూరి, కందుకూరి వీరేశలింగంగార్ల విరచిత
**"సంపూర్ణ నీతి చంద్రిక"**
(1/8 డెమ్మీలో 300 పేజీలు)

★ అన్ని తరగతుల విద్యార్థులకు ఉపయోగపడు
"ఇంగ్లీషు గ్రామరు",
"హిందీ వ్యాకరణము"

★ ప్రాచీన ఆయుర్వేద యోగములతో, అనుభవ
"ఆయుర్వేద చికిత్సా విధానము"

★ కలిదోష నివారణ కొఱకు నిత్యపారాయణ గ్రంథం
"నల దమయంతుల కథ"

★ బమ్మెర పోతన భాగవతంలో అంతర్గత భావసౌందర్య
వ్యాఖ్యాన గ్రంథము
"పోతన భాగవత రత్నాలు"

★ ప్రముఖ సంఘ సంస్కర్త వీరేశలింగంగారి ప్రఖ్యాత
హాస్య నవల
"సత్యరాజా పూర్వ దేశ యాత్రలు"

★ లోకజ్ఞతకు, భాషా జ్ఞానానికి ఉపయోగపడు
"నీతి శతక రత్నావళి"
(ఆంధ్ర-ఆంగ్ల తాత్పర్య సహితము)



# నలదమయంతుల కథ

కథాకథనమునందు నిపుణుడైన సూతమహర్షి శౌనకాది మునివరుల కీవిధంగా చెప్పనారంభించాడు.

ధర్మరాజాదులయిన పాండవులు ద్రౌపదితోనూ కొద్ది మంది బ్రాహ్మణులతో కూడి రాజ్యభ్రష్టులై అరణ్యవాసము చేయుచు ద్వైతవనమును ప్రవేశించి కష్టాలపాలయి ఎలాగో కాలం గడుపుతూన్నారు. అక్కడికి తమను చూడ్డానికి వచ్చే అతిథి అభ్యాగతులను యథావిధిగా అర్చించి అప్పుడు అక్కడ సంభవించే కందమూలాదులచే తృప్తులను గావింపుచు వారిచే ఆశీస్సులు పొందుతూ కాలం కష్టాలతో వెళ్ళబుచ్చుతున్నారు.

## బృహదశ్వముని రాక

ఒకనాడు భీమసేనుడు అన్నగారగు ధర్మరాజుతో దుర్యోధనాదులు చేసిన తప్పిదాలను ఉట్టంకించుతూ రెచ్చిపోయి మాట్లాడసాగాడు. అటువంటి భీమసేనుని చూచి ధర్మరాజు అనునయ వాక్యాలతో శాంతపరుస్తున్నాడు. ఆ సమ

యంలో మహానుభావుడైన బృహదశ్వుండు అనే మహర్షి వారిని చూడ వచ్చినాడు.

ధర్మరాజు అర్ఘ్యపాద్యాదులతో మహామునికి ఎదురేగి పూజించి లోనికి తీసుకుని వచ్చి మర్యాదపూర్వకంగా విశ్రమింపజేసినాడు.

## ధర్మరాజాదుల అరణ్యవాస కారణం

విశ్రాంతి తీసుకొన్న తర్వాత బృహదశ్వుడు సంశయం ఆశ్చర్యం ముప్పిరిగొనుచుండగా ధర్మారాజుని యిలా ప్రశ్నించాడు. "ఓ ధర్మనందనా! ఇంత చిరుత ప్రాయంలో సమస్త రాజ్యాన్నీ భోగభాగ్యాలనీ విడిచి క్రూరమృగాలకు ఆలవాలమైన యీ అడవిలో యిలా ఎందులకు కష్టాలనుభవించుచున్నారు" అని అడగ్గా ధర్మరాజు బృహదశ్వునికి యిలా బదులు పలికాడు. "ఓ మహామునీ! మా పెదతండ్రిగారగు ధృతరాష్ట్రిరాజు మాకు పంచియిచ్చిన రాజ్యభాగమును స్వీకరించి సంతుష్టిపడి యింద్రప్రస్థమును రాజధానిగా జేసికొని ధర్మబుద్ధి కలిగి న్యాయంగా రాజ్యపాలన గావింపుచున్నాము. సిరిసంపదలతోకూడి కీర్తివంతమైన మా పాలనను చూచిన దుర్యోధనుడు అసూయాగ్రస్తుడై మమ్ము ద్యూతక్రీడకు పిలిచి మాయోపాయమున విజయం పొంది అనంతరం ద్రౌపది మొదలగువార్ని అవమానాలపాలుచేసి చివరికి అడవిపాలు చేసినాడు" అని వినయ విధేయతలతో పలికి యింకా యిలా అన్నాడు. "ఓ మహామునీ! మాలా యిలా అరణ్య దుఃఖాలపాలయినవారు మునుపు ఎవరైనా

వున్నారా” అని అడగ్గా, ఓ ధర్మరాజా! ఉన్నాడు. లేకేమి? కష్టాలనుభవించు కాలం దాపురించినప్పుడు, విధివిలాసం వికటించినప్పుడు ఎవ్వరైననూ పలురకాల కష్టాలకు గురి అవ్వాలసిందే. విధికి మీరూ వారూ అని దయలేదు.

## నలుని పరిచయం

పూర్వం నలుడను నిషధ దేశాధీశుడు నీవలెనే కష్టకాలం దాపురించినవేళ అరణ్యాలపాలు అయ్యాడు. భార్యకి దూరం అయ్యాడు. పడరాని పాట్లన్నీ పడ్డాడు. ఇందుకు చింతిల్లకు రాజా! అతనిలానే మరల రాజ్యాన్ని పొంది మహావైభవంతో రెట్టించిన భోగభాగ్యాలను పొంది, నిశ్చింత్రతనంగా అసమాన కీర్తిప్రతిష్టలతో అనంతకాలం నువ్వుకూడా రాజ్యపాలన కావించుతావు” అని పలుకుతూన్న బృహదశ్వమహామునిని చూచి ఆశ్చర్యవదనంతో ధర్మనందనుడు “అయ్యా! మునివరా! ఆ నలుడనువాడు ఎవరు? ఎందులకు కష్టాలపాలయినాడు, ఆ కష్టాలనగా ఎట్టివి? వాటిని ఎలాదాటాడు? చివరికి రాజ్యాన్ని తిరిగి ఎలాపొందగలిగాడో ఆ కథనంతనూ సవిస్తరంగా చెప్పి నాకు ధైర్యం ఉత్సాహం కలిగించు. ఈ వనవాస క్లేశాన్ని ధైర్యంగా ఎదుర్కొనగలవాడను” అని వేడగా బృహదశ్వుడాతని మాటలను విని కొంచెంసేపు కనులు మూసి యోచించి ధర్మజుని ముఖంవైపు చూస్తూ యిలా చెప్పాడు.

## నలుడి కథ

"ఓ పాండవాగ్రజా! నిషధ దేశపు రాజయిన వీర సేన మహారాజుకి కుమారుడు నలుడనువాడు రాజ్యపాలన ప్రజారంజకంగా చేస్తున్నాడు. ఆ రాజు వేదసాధులయందు దయా దానగుణాలు కలిగి బ్రాహ్మణులన్నా దేవతలన్నా భక్తి కలిగి యజ్ఞయాగాదులు చేస్తూ తేజోవంతుడు పరాక్రమ సంపన్నుడు శత్రు భయంకరంగా ధర్మయుతంగా ఉన్నవాడై కీర్తి ప్రతిష్ఠలతో రాజ్యం చేస్తున్నాడు. ఆ నలమహారాజు రూపవంతుడు యౌవనవంతుడు అయి సకల సంపదలూ కలిగి భోగభాగ్యాలనుభవిస్తూన్నాడు.

## దమయంతి జన్మ

అదే కాలంలో విదర్భ దేశానికి ప్రభువైన మంచి గుణశీలాదులతో ఒప్పుచున్న భీమరాజు అనేవాడు ఏ సంతానం లేక దానధర్మాలూ వ్రతాలూ సంతానం కోరి చేస్తు దమనుడు అనే మహర్షిని సేవించుతున్నాడు. ఆ విధంగా భీమరాజు దంపతులు శ్రద్ధాభక్తులతో దమన మునిని సేవించుతూ చివరికి ఆయన దయకి పాత్రులై ఒక కన్యను పొందినారు. ఆమె దమయంతి అను పేరు కలిగి రూపం మంచి గుణాలూ కలిగి దినదినాభివృద్ధి చెందుతూన్న చంద్రరేఖలా పెంపొందజొచ్చెను.

## దమయంతి యవ్వన దశ

దమయంతి బాల్యానురూపం అయిన ఆట పాటలతో విలసిల్లుతూ మంచి అవయవసౌష్ఠవం కలిగి చక్కటి శుభలక్షణాలు కలిగి మందస్మిత వదనారవిందాలు కలిగిన నూరుగురు సఖురాండ్రతో కూడి ఆడుతూ పాడుతూ యౌవనదశలోనికి చేరింది. తల్లిదండ్రులకు సంతోషం చేకూరుస్తూ ఉండగా ఆమె యొక్క గుణ శీల రూప సంపదలు కర్ణాకర్ణికగా లోకమందంతటను ప్రచారం కాజొచ్చెను. ఎందరో రాజకుమారులు ఆమెయొక్క గుణగణాలనీ కుల శీలాదుల్నీ చిన్నె వన్నెలనీ వింటూ ఎంతో ఆకర్షితులు కాజొచ్చిరి.

ఇదే ప్రకారంగా నలమహారాజు యొక్క సుందర రూపం, వీర శూరగుణాలూ కీర్తి ప్రతిష్ఠలూ నల్లడీలా చందన మారుతంలా వ్యాపింప జొచ్చెను.

## నలుడు దమయంతిని ప్రేమించుట

విరివిగా లోకంలో ప్రచారంలోకి వచ్చిన దమయంతి యొక్క గుణవిశేషాలను కర్ణాకర్ణికగా వింటూన్న నలుడు ఆమెయందు ప్రేమకల వాడయ్యాడు. దమయంతి యొక్క రూప శీలాదులు నలుని మనస్సులో ఇట్టే చోటు చేసుకొని అతని మనస్సుని కళవళపరచసాగెను.

దమయంతి ఒక సౌందర్య దేవతగా ఆరాధ్యరూప సుందరిగా అతిలోక లావణ్య యౌవన ప్రతిభా సమానురాలిగా నలుని మనస్సులోని కలల పంటగా అయి నలుని మనస్సుకి ఏం తోచని పరిస్థితి ఎదురయ్యింది. అటువంటి పరి

స్థితిలో ఏదేనా వినోదం కోసం తన సుందరోద్యానంలోకి విహారణార్థంగా నలుడు వెళ్ళాడు. అంతట అక్కడ అందంగా బారులుతీరి ఆకాశం నుంచి భూమిమీదికి దిగివచ్చి నలుడి దిగువ భావి చెంత విలాసోల్లాసాలతో రాయంచల గుంపు తిరుగాడసాగింది.

ఆ మనోహర దృశ్యాన్ని తిలకిస్తున్న నలరాజు ఆశ్చర్యపడుతూ వాటిని చూసి ఆనందపడుతూ ఆ రాజ హంసలవైపు పరుగుతీశాడు. ఆ అంచలు ఒక్కుమ్మడిగా ఆందచందాలు చిందిస్తూ ఆకాశంవైపు పరుగుతీసాయి. కాని అలా ఎగిరిపోతూన్న హంసల గుంపునుంచి ఓ హంస పారిపో తూన్నట్లు తడబడుతూన్న నడకలతో మందగమనంతో ఉండెను. ఒయ్యారపు టడుగులతో మెల్లగా వెళ్ళి ఆ రాజ హంసను చల్లగా నలచక్రవర్తి చేజిక్కించుకొనెను. ఆ రాజ హంసయు భయం నటిస్తూ బిత్తరగా చూస్తూ అమాయకంగా మనుష్య భాషణంతో యిలా అంది.

## నలుడితో రాజహంస పలుకులు

"అయ్యా! నిషధరాజ! నేను స్వచ్ఛందంగా ఆకాశంలో తిరుగాడే హంసశాబకాన్ని. నా తోడి హంసలతో ఎగుర లేక బలిమి లేమింజేసి వెనుబడిపోతిని. ఇన్ని పలుకలేల? నన్ను విడిచి పుచ్చుము. అట్లు చేసినచో నే నీకు ప్రత్యుప కారం చేయగలదానను. నాకే కీడు చేయక నన్ను విడిచితివా నీ మనఃప్రియురాలైన దమయంతికి నీ గుణ గణ వైభవ రూప సౌందర్యాదులను వర్ణించి చెప్పి నీ యందు అనురాగం కల

దాన్నిగా చేయగలదాన్ని రాజా! నువ్వు విడిచిన వెంటనే విదర్భాపురానికి నే బయల్దేరుచున్నాను. అనగా నలరాజు దాన్ని ఆలస్యం చేయక విడిచిపెట్టాడు.

## దమయంతితో హంస సంభాషించుట

చిన్నారి హంస తనకై ఆకాశంమీద అరచుచు తిరుగుతూన్న హంసల గుంపును చేరి తిన్నగా కుండిన నగరానికి ప్రయాణం అయ్యెను.

ఆ సమయమందు దమయంతి తన సఖురాండ్రతో సరదాగా విహారార్థం ఉపవనానికి వెళ్ళి తటాక సమీపమున క్రీడింప దొడగెను. అట్టితరి రాజహంసల గుంపు ఆకాశం నుంచి మెల్లగా కిలకిలారావాలతో సీడల సోయగం ఉల్లసించుతూండగా తటాక తీరమున సంచరింప జొచ్చెను. అంతలో సఖురాండ్రు తమ యిచ్ఛవచ్చినట్లు అటూ యిటూ హంసలను తరుముతూ పట్టుకొన్నారు. దమయంతి చేతికి దొరికినది నలుని దౌత్యానికి ఒప్పుకున్న హంస శాబకమే అయింది. ఆ హంస శాబకం నలుని గుణాలను మనుజ భాషణంలో గానం చేస్తోంది.

దానిని వింటూన్న దమయంతి ఆశ్చర్యపడుతూ మిలమిలలాడే చూపులతో చూస్తూ హంసశాబకాన్ని యిలా పలకరించింది.

"ఓహో! రాజహంసమా! ఏమో మధుర భాషణాలు సలుపుతున్నావు? అదికూడా మా భాషలో తీయగా పలుకుచున్నావు. అందులోనూ ఆ...ఆయనని గురించిన ఆ పలు

కులు మరీ ప్రియతమమైనవి. ఏమిటో స్పష్టంగా చెబుదూ. 'నీకు చాలా పుణ్యం వుంటుంది" అని నిసర మధుర భాషణంతో అనగా విని రాజహంస ఆ మాటలందుకుని యిలా అంది.

"ఓ దమయంతీ! నీ అందం రాజలోకాన్ని కలవర పరుస్తోంది. కాని ఆ రాజులందరిలో ఓ రాజు నీ మనస్సుకి నచ్చే రాజు. అతడే మహావీరుడు, శూరుడు అయిన నల చక్రవర్తి. నీ ప్రేమకు తగిన వలపుల రాజు. సుందరమూర్తి మధుర హృదయుడు. నే చూసిన రాజచక్రంలో తలమానికంలాంటి వాడు. అట్టివానిని భర్తగా పొందిన యువతిదే యీ లోకంలో అదృష్టం. అన్నింటా ఆ రాజుకీ నీకూ సంబంధం సార్థకమైనది. లోకంలో ప్రేమ జీవనానికి ఉదాహరణ రూపమైనది అని చెప్తున్న హంసశాబక వాక్యాలకి ఎంతో ముచ్చటపడి హృదయం విడిచి తన మనస్సులోని అర్థాన్ని యిలా విప్పి చెప్పింది.

ఓ సుందర రాజహంసమా! చాలా సంతోషం! నీ సంలాపం నా మనస్సుకి పరమానందాన్ని కలిగించింది. నా మనస్సులో గల నలుని గురించిన భావాలు అవే అవి. నువ్వు చెప్పినవి. మరి నా యీ ముగ్ధ సందేశాన్ని నిషధ రాజుకి నాకాతని గూర్చిన రీతిగా చెప్పి పుణ్యం కట్టుకో నీకెన్నో కృతజ్ఞతలు అంటూ హంసశాబకాన్ని దమయంతి విడిచింది.

ఈ విధంగా నలునికీ దమయంతికీ ప్రేమ సందేశాలని అందించి వారి లేత ప్రేమల బంధాలని దృఢతరంచేసి తన దారిని పోయింది ఆ రాజహంస.

ఈ రాజహంసని సందేశ చతురురాలని శ్లాఘించవలసి యున్నది. నలునిలో దమయంతి సుందర రూపాన్ని దమయంతి మనస్సులో నలుడి మనోహరాకారాన్ని రేఖాకృతులుగా గానంచేసి వారిద్దర్నీ ఏకం చేసింది. అలాంటి తరుణ హృదయాల్లో అసలు ప్రేమే ఎంతో చిరులతల్లాంటిది. ఈలాంటి సుందర సన్నివేశాలతో కూడిన ప్రేమలు యింకా యింకా ఎంతో మురిపాలతో ముదిరిపోతూంటాయి. సరిగ్గా నలదమయంతుల విషయంలో యిదే జరిగింది.

నలుడిలో దమయంతిని గూర్చిన మనోభావవృక్షం, దమయంతిలో నలుడి గురించిన భావలతల గములు ఎన్నో యెన్నోగా పెచ్చుపెరుగుతున్నాయి.

హంస ఆశీస్సులతో పెరిగే ప్రేమపాశాలలో బద్ధులయిపోయారు నల దమయంతు లిద్దరూ.

నాటినుంచీ దమయంతి నలుడి వలపు తలపులలో చిక్కుకుని చిక్కిపోజొచ్చింది. చెలికత్తెలతో ఉల్లాస విలాస సంలాపాలు చాలా తగ్గించేసింది. ఏకాంతంగా ఏదో తల పోయసాగింది. అలంకరించుకోవడంలో అశ్రద్ధ వహించింది. నిషధపురం వైపే చూపు. అదే తలంపు. అతడే హృదయ వినోద పరాయణుడు. ఇలాంటి వైనాన్ని పసికట్టిన వనితలు దమయంతి మనోవేదనకు కారణాలను విదర్భదేశ ప్రభువైన భీమరాజుకి ఎరింగించారు.

## దమయంతీ స్వయంవరం

తన కుమార్తె దమయంతి వివాహ వయస్సునకు తగిన దైనది అనే వార్త వినగానే తన గారాబు పట్టికి తగిన వరు డెవరై ఉండునా అని అట్టివాడు ఎలాంటివాడూ ఎంతటి వాడు, సమఉజ్జీ అయినవాడు ఎవరా అని యోచించి సమ స్యకి పరిష్కార మార్గం కనబడక ఉన్నంతలో ఎందరో రాజ కుమారులు తమ తమ అభ్యర్థనలను విదర్భ రాజుకి పరం పరలుగా పంపజొచ్చిరి.

ఇట్టి పరిస్థితిలో ఏం చెయ్యడానికీ తోచక స్వయంవరం భీమరాజు ప్రకటించాడు. దమయంతీ స్వయంవర వార్తలు నలుదిక్కులా పూల పరిమళంలా వ్యాపింపసాగాయి.

స్వయంవర వార్తలు వింటూన్న రాకుమారులు పలు రకాల ఊహాగానాలు చేయసాగిరి. తననే దమయంతి వరిం చును. తనదే స్వయంవర విజయం అని ఉవ్విళ్ళూరుతూ క్రొంగొత్త వేషభాషలలో శిక్షుతులు కాజొచ్చిరి. "నేను ముందు నేను ముందు" అనుకుంటూ వివాహ నేపథ్యంతో కొందరు రాకుమారులు అతివేగంగా కుండినపురానికి విచ్చేయజొచ్చిరి.

## పర్వత నారదులు యిందుని దర్శించుట

ఆ సమయంలో పర్వత నారదులను దేవర్షులు భూలోక సంచారము చేయుచు దమయంతీ స్వయంవర కోలాహలాన్ని చూచి విని ఆశ్చర్య చకితులయి కనులారా ఆ బ్రహ్మచారి మునులు వివాహాగత రాజకుమారులను మరీ మరీ చూస్తూ

మురిసిపోతూ యీ వార్త యింద్రాదులకు వినిపించిపోవడం కోసం అన్నట్లుగా కల్యాణీరాగం అమృతవర్షిణి రాగాలను ఆ వీణెల మెట్లపై పులకించి పలికిస్తూ స్వర్గద్వారాలు దాటి పోయారు.

అది సుధర్మ. అక్కడ అందరూ రంభాది అప్సరసల నాట్యరవళులకి తన్మయులై యున్నారు. అట్టితరిని యింద్రుడికి నమస్కరించి ఆతని ఆజ్ఞని అనుసరించి ఆసీనులయ్యారు.

అప్పుడు వార్ని యింద్రుడు అడిగాడు. "మునివరులారా! ఇదివరలోలా యిప్పుడు యింద్రలోక సౌఖ్యాలనుభవించడానికి యీ మధ్య భూలోకంనుంచి రాజులరాక తగ్గిపోయినది. కారణం ఏమై ఉండును?"

పర్వత నారదులిద్దరూ ఒకరి మొహం ఒకరు చూసుకుంటూ కారణం నువ్వు చెప్పు అంటే నువ్వు చెప్పు అంటూ చివరికి నారదుడు చొరవ చేసి "యింద్రా! అదీ సంగతి. ప్రస్తుతం విదర్భరాజు యొక్క కుమార్తె దమయంతి. ఆమె కోసం స్వయంవరం ప్రకటింపబడింది. రాజులందరూ ఆ అతి లోక సుందర నారీమణిని చేబట్టడం ఒక అద్భుత అదృష్టంగా భావించి ఆ దమయంతీ బద్ధచిత్తులయి యితర లోకాలూ సుఖాలు అన్నమాటే మరిచారు. దమయంతీ స్వయంవరం అన్నదే నాదం. అదే నినాదం" అని చెప్తూండగా యింద్రుడు ఆ యిద్దరు దేవర్షులను వీడ్కొలిపి తాను కూడా ఆ స్వయంవరంలో ఓ అభ్యర్థిగా కాదు తనతోపాటు యమ వరుణ కుబేరుల్ని కూడా వెంటపెట్టుకు వెడితే బహు బావుంటుంది; భేషుగ్గా ఉంటుందని యోచించి గబగబా ఆ మిగి

లిన దేవతలను కూడా ఆకాశయానం చేస్తూ దమయంతి నివసించే కుండిన నగరం వైపు దోనపట్టారు.

## దేవతలు నలుడితో సంభాషించుట

దమయంతీ స్వయంవరానికి కుండిన నగరానికి వెడుతూన్న రాజవరులలో నలుడు కూడా మంచి సరదాగా వర వేషం దాల్చి రథారూఢుడై కుండిన నగర సమీపానికి వచ్చాడు. ఆ సమయమందు ఆకాశరంగం నుంచి క్రిందికి దిగివస్తూన్న ఇంద్ర యమ వరుణ కుబేరుల విమానాన్ని నల చక్రవర్తి చూసాడు. ఆశ్చర్యంగా ఆ దేవ విమానం తన యెదుటనే ఆగింది. దాని నుండి ఇంద్ర యమ వరుణ కుబేరులు నలుగురూ వర వేషం ధరించి మనోహరాకారుడై వున్న నల చక్రవర్తిని పలకరించారు.

"ఓ భూపతీ! నువ్వు చూడగా పరోపకార సమర్థుడవగు రాజుగా తోస్తున్నావు. నువ్వు మాకో ఉపకారం చేసి పెట్టాలి" అనగా దేవతలతో నలుడిట్టా అన్నాడు. "అయ్యా! మీరు కోరినట్లు సరేకాని. అసలు మీరు ఎవరు? నే చేయవలసిన దూతకృత్యం అంటే ఏమిటి?" అని అంటూన్న నలుణ్ణి చూసి "అదా చెప్తా. అసలు మేం ముందు ఎవరో చెప్తాం. మేం నలుగురం దిశాధిపతులం. నేను యింద్రుణ్ణి, ఈతడు యముడు, ఆయన వరుణుడు మిగతా ఆయన కుబేరుడును. మేం ప్రస్తుతం ప్రఖ్యాత సుందరి అయిన దమయంతీ స్వయంవరానికి విచ్చేశాం. మమ్మల్ని గురించి ఆ చిగురుబోణికి ముందుగా యించుక పరిచయ వాక్యాలు చెప్పాలి. అలాచేస్తే ఆమె మమ్మల్ని వరిస్తుంది" అని అనగా

నలుడు నమ్రత చూపుతూ "దేవతలారా! మీరున్నూ నేనున్నూ ఒకే పనిమీద యిక్కడికి అంటే దమయంతీ స్వయంవరానికి వచ్చాంకదా. అటువంటప్పుడు నన్ను మీరు యిట్టి పనికి వినియోగించుట తగినదేనా? అని. అయితే మీవంటివారికి ఉపకారం చేయవలసినదే. అన్నమాటను విడనాడను. అట్లు చేయుట తప్పిదమే అగును. కాని దమయంతికి మిమ్ము పరిచయం చెయ్యాలంటే ఆమె ఉండే అంతఃపురాన్ని ప్రవేశించాలి. అంతఃపురానికి నే అంటే పురుషుడను ఎట్లు పోగలను. యిది ఎట్లు సంభవం స్వాములారా!" అని ప్రశ్నించాడు నలుడు దేవతల్ని. ఆ మాటలు విన్న దేవతలు చిరునవ్వు నవ్వి, "ఓయీ! నిషధేశ్వరా! రాజాంతఃపురం ఆయుధాలు ధరించిన భటులచే రక్షింపబడుగాక, అయినను సుఖంగా నీవు అంతపురిలోనికి ఏ ఆటంకం లేక ప్రవేశించగలవు. మేం నీకు శాంబరీ విద్యను ప్రసాదించుతున్నాము. దాని ప్రభావంచే నువ్వు యితరులకు గనరావు. ఇతరులు నీకు మామూలుగా కనబడుతారు. నీకే ఆటంకం ఉండదు. ఇది దేవకార్యం నీకు శుభం అగుగాక! మేమిచ్చటనే నీ రాకకై యెదురు చూస్తూంటాము. కార్యసిద్ధితో తిరిగిరమ్ము, పొమ్ము" అని పలుకుతూన్న శక్రుడివద్ద సెలవు గైకొని నల మహారాజు మాయా విద్యా ప్రభావంచే దేవకార్యం సాధించటానికి కృతనిశ్చయుడై దమయంతీ అంతఃపురంవైపు నడుచు కుంటూ ఏదో ఆలోచనతో యువతుల రాకపోకలతో కలకలలాడుతూ చక్కగా అలంకరించబడియున్న పూల త్రోవలతో గుబాళించుతూన్న అంతఃపురం లోనికి వెళ్ళాడు.

## అంతఃపురంలో దమయంతి

"ఓహో! ఎంతటి సౌందర్యం! అద్భుతం" అని అచ్చెరువుపడుతూ చక్కని అందవతులయిన సకియలతో సంసేవ్యమానురాలయి ఉన్న దమయంతిని వెన్నెల కుప్పలులా, కమ్మని కలువల రాసులలా, నవ్వుల సొబగుల మూర్తిలా అల్లంత దూరంలో కనుల వైభవంగా దర్శించాడు. కొద్దిసేపు అలా అలా చూస్తూ నిశ్చేతనుడై నిశ్చేష్టుడై కింకర్తవ్యతామూఢుడై నిల్చుండిపోయాడు మూర్ఛపోయిన వాడిలా ఆ నలమహారాజు...ఒక్కసారి కనులు నులుముకొని మిల మిలలాడే కనులతో మళ్ళీ ఆ అపురూప సుందరతర దృశ్యాన్ని తిలకించాడు. పలురకాల చూపులతో ఆమెని యింకా యింకా చూడాలనిపించుతూంటే దృష్టుల్ని నమ్మ లేక ఆ దమయంతిని అలానే చూస్తూ వుండిపోయాడు. "హంస చెప్పి వ్రాసి యిచ్చిన చిత్తరువుకంటె ఎన్నోరెట్లు కాదు యింకా ఎంతగానో అత్యంత సుందర నవమాలికా కుసుమ శోభల పంటలా ఉన్న దమయంతిని చూశాడు. తనివి తీరని ఆమెను చూస్తూ ఆమెకై అందమైన దేవతలే ఆ అగ్రశ్రేణి దేవతలే దివినుంచి భూమికి దిగివచ్చారంటే ఆశ్చర్యం అయినదటువంటి ఆ దమయంతి. దేవతాస్త్రీల సౌందర్యాన్ని మించిన సౌందర్య దేవత దమయంతి" అను కుంటూ తన మామూలు ఫక్కీలో ఆమె విరహవేదనలో పరవశతిని పొందాలో మానాలో అర్థంకాక కళవళ పడు తూన్న మనస్సుతో మెల్లిమెల్లిగా నడుచుకుంటూ నిజదర్శ నంతో నిలిచాడామె ముందు. నూరుగురు చెలులూ ఒక్క

సారి తమ యెదుట అకాల జలదికాలంలో కనబడిన హరి విల్లులా దర్శనం యిస్తూన్న నలుణ్ణి చూశారు. చూడగానే శృంగార రస ప్రవాహ తరంగాలలా ఉన్న ఆ సఖురాం డ్రందరూ లేచి నిలబడి ఆ రాజుకి పేరుతో స్వాగతం పలి కారు. అగ్రశేణ సుందరాకారుల పోలికలతో అంటే మద నుడో వైజయన్తుడో అన్నట్లుగా ఉన్న నలమహారాజుని ఎదు రొక్కని తీసుకువచ్చి చక్కని ఆసనంపై కూర్చుండజేశారు. అతన్ని చూస్తూన్న దమయంతి మానసికాందోళ ఉత్సాహ ప్రదేశాలతో ఎలాగో అయిపోతూ కొద్దిగా లజ్జవిడిచి శాంబరీ విద్యాప్రభావం విడిచిన నలుణ్ణి దివ్యశరీరంతో ధగధగ మెరు స్తూన్న రాజుని దమయంతి చెమ్మగిల్లిన కళ్ళతో పరవశమైన చూపుల్ని అతనిపై ఒలికించుతూ కలకంఠస్వరంతో స్మృదూ క్తులతో పలకరించింది.

## నల దమయంతుల సంభాషణం

"ఓ మహారాజ! కట్టుదిట్టమైన కాపలా ఏర్పాట్లతో రక్షింపబడుతూన్న ఈ అంతఃపురంలోనికి నీవంటి మహా పురుషుడవు ఏ కారణంగా వచ్చియుండుట జరిగినది?" అని దమయంతి ప్రశ్నించింది.

"ఓ విదర్భరాజ కన్యారత్నమా!" నలుడు అంటు న్నాడు. "ఇంద్ర యమ వరుణ కుబేరులు నీ స్వయంవరానికి నిన్ను అంటే నీ మధురాకృతిని వలచి వచ్చారు. ఆ దారిగా నేనూ వస్తూండగా వారు నన్ను ఆపి తమ కోరికను చెప్పి నిన్ను ఒప్పించడానికి దూతగా శాంబరీ విద్యను ఒసంగి నీ చెంతకు పంపారు నన్ను. ఆ శాంబరీ విద్యా ప్రభావం కార

ణంగా యితరుల కంట పడకుండా స్వేచ్ఛగా ఈ అంతఃపురానికి రాగలిగితిని.

ఓ దమయంతీ! నువ్వు ఆ నలుగురు వేల్పులలో ఒకర్ని చేపట్టి వారి యిష్టానికి పాత్రురాలవు అయి సుఖించు" అంటూన్న నలునివైపు చూస్తూ యిలా అంది ఆ విదర్భ రాకుమారి. "ఓయ్! హృదయనాథా! నలరాజా! మునుపు రాజహంసచే మీ ప్రేమని తెలుపుతూ కబురు పంపిన ఆ రాజ కుమారులేకదా! ఆ హంస మీ విషయాలను నిండుగా వాక్రుచ్చింది." కనుల నీరు నింపుతూ కంఠం సరిచేసుకుని మళ్ళీ యిలా చెప్పసాగింది. "ఆర్యా! నా హృదయాన్ని మీయందలి నా అనురాగాన్ని రాజహంసచే కబురు పంపిన ముగ్ధురాలను. అది మీ యందలి అనన్య ప్రేమచే చేసిన నా నిశ్చితార్థం. హంస మీ ఛాయాచిత్రాన్ని తన ముక్కుతో వ్రాసి చూపింది. మిమ్మల్ని గురించి మీ ప్రేమల గురించి మీ అందచందాల గురించి ఆ రాజహంస ఎంతో చక్కని వర్ణనలు చేసింది. ఆ మధుర కథా ప్రబంధం నా హృదయంలో వేయి రాగాలుగా నాలో మారుమ్రోగుతోంది. అన్ని హృదయ కోణాలలోనూ ఆ భావాలే, ఆ తలంపులే, ఆ కామనలే ఆ ముచ్చట్లే. ఆ ప్రేమల తలపు పందిళ్ళపై కురుస్తూన్న ప్రేమ వెన్నెలలు మీవే. అలా మిమ్ము నా హృదయంలో వింటూ చూస్తూన్న నాకు మీరు యిట్టి ఉపదేశం చేయు సాహసించితిరంటే ఆ నా హృదయంలో పెరిగిపోతూన్న ప్రేమలతల పందిళ్ళన్నీ పెనుగాలులకి ఎగిరిపోతున్నట్లో మంచుకొండలకి మాడిపోతూన్నట్లయిపోయి, మనస్సు వికలం అయిపోతోంది ప్రభూ! నన్ను హంససాక్షిగా మీకు అర్పించు

కున్నాను. మిమ్మల్ని గురించీ మీ అభిప్రాయాల గురించి మీ నిర్ధారణలను హంస ఎంతగానో దృఢపరిచింది. ఇప్పుడు అటు వంటి మీరు ఎవరో యింద్రాదులని చెప్పి నా ప్రేమలను చెదరగొట్ట చూడ్డం మీకు ధర్మం అనిపించిందా. మీ మనస్సు నచ్చుకుందా? ఇది ప్రేమికులలో కలగవలసిన తలంపులేనా? ఇక యింద్రాదులకు పుట్టిన బుద్ధి ఏం అంత ఉచితమైనది! నేను మానవకాంతను. వారు దేవజాతివారు. వారికీ మా బోంట్లతో వియ్యం తగునా? పైగా నే వారికి కూతురులాంటి దానను. కలలోకూడా యిటువంటి పీడకల వస్తుందని తలంచలేదు. వచ్చినట్లయిన తాళలేని అశక్తు రాలను. ఓ ప్రియ నలా రక్షింపు అని ఆక్రందనం చేసి భయకంపితురాలనై ఉండేదాన్ని."

"క్షమించండి. దేవతలగుగాక గీవతులు అగుగాక! ప్రేమని మార్చడం నా హృదయానికి ఏనాడూ ఏ పరిస్థితి లోనూ ఏ విధంగాను అసాధ్యం అసాధ్యం. ఇది ముమ్మాటికీ నిజం. నా ప్రాణపతి ఏనాటికీ మీరే మీరే...కాబోమే స్వయంవర మంటపంలో నా పూలమాలను మీరు కంఠ మందు ధరించి నన్ను చేపట్టండి." అని చెప్పి మూర్ఛితు రాలయింది.

అటు తరువాత అంతా మండిత మండపాలనీ పూల తోరణాలతో సుశోభితమై మనోహరంగా ఉన్న దమయంతి కూర్చున్న శిల్ప చిత్రిత వేదికనూ ఆ సఖురాండ్ర కలకలా రావాలను స్మరించుకుంటూ దమయంతి యొక్క వచన చతు

రతకూ ఎంతగానో ముగ్ధుడౌతూ ఆమె అభిప్రాయాలను యింద్రాది దేవతలకు వినిపించుటకు శాంబరీ విద్యా విహితుడై గబగబా చంద్రశాలలను దాటి కోట వెలుపల తన కోసం ఎదురు చూస్తూన్న దేవతలను సమీపించి దమయంతి దేవతల అభీష్టంను తిరస్కరించిన విధానాన్ని నిషధరాజైన నలుడు వివరించాడు.

## స్వ యం వ రం

అనంతరం దేవతలను విడిచి యిమ్మడించిన స్వయం వరోత్సాహంతో మణిమాణిక్యాలతో మంగళకర తోరణాలతో పలురకాల అపురూప శిల్ప ప్రతిమలతో అపర స్వర్గంలా ఉన్న స్వయంవర మంటపానికి సరిగా సమయానికి చేరుకొన్నాడు.

అటు తరువాత నలుగురు దేవతలూ మాడిన ముఖాలతో ఏవో బీరాలు పలుకుతూ "చూస్తాం" మీ స్వయంవరం ఎలా జరుగుతుందో? రండి మనం నలుగురం నలుడి వేషాలలో వెళ్ళి అతని పక్కనే కల ఆసనాలపై కూర్చుందాం. అదిగో స్వయంవర సమారంభ కలకలం విన వస్తోంది." అనుకుని యింకా సంతోషంతో స్వయంవర సభాస్థలికి నల వేషాలు ధరించిన నలుగురు దేవతలూ వెళ్ళి నలుని ప్రక్కన ఉన్న శిల్ప చిత్రమనోహార ఆసనాలమీద ఆసీనులయ్యారు. సభలోగల రాజకుమారుల సమూహం అంతా ఒకే రూపున అంటే నలుని యాకారాలుగల దేవతలని

చూసి వింత దృశ్యంగా భావించి అందరూ చూస్తుండి పోయారు.

చెలికత్తెలు దమయంతిని పట్టుకుని స్వయంవర మంటపానికి తీసుకువచ్చారు. ఆమె చేతితో స్వయంవరార్థం రచించిన అతి సుందర కుసుమ మాలికలను చేబూని ఒక్కసారి నలుదిశలను సింహాసనములపై ఆసీనులయి ఉన్న తరుణ రాజకుమారులను అందర్నీ వీక్షించింది దమయంతి. తండ్రి అయిన విదర్భాధిపతి పర్యవేక్షించుచుండగా ఆ రాజకుమారులను పరికించుచూ నలుడున్న వైపు దృష్టులను సారించింది. అక్కడ అయిదుగురు నలులని ఏకాకారులుగా ఉన్న మూర్తులను దర్శించింది. అచ్చట వున్న రాజవరులందరూ ఆమెను కనులారా తిలకించుతున్నారు. అటువంటి అతిలోక సుందరికి భర్తయగు రాజకుమారుడెవరైయుండునో అని తత్తర పాటుతో ఆవేశ మనస్సులతో ఉన్నారు.

ఇక దమయంతి ఏకపరీక్షగా నల వేషధారుల వైపు చూస్తూ "ఏ ఉపాయంతో అసలు మనోహర నలుని తెలుసుకోగల దానను" అని దుఃఖకలుష కంఠధ్వనితో దేవతలను ప్రార్థించింది.

"ఓ సురవరులారా!" దమయంతి మనస్సులో "నేను నలుణ్ణే ప్రాణపతిగా భావించుచున్నాను. నాయందు దయ చూపుతూ మీమీ సహజ రూపాలను ధరించి నా నలుని నాకు కనిపింపజేయండి. ఓ అనిమిషులారా! మిమ్ము మరీ మరీ ప్రార్థించుకుంటున్నాను" అని చింతిల్లుచుండగా అనిమిషలోచనులు అస్వేదగాత్రులూ భూమిని స్పృశింపక నిలిచారు.

అంతటితో నిజనలుడు దర్శనమిచ్చాడు. ఇంకేముంది? దమయంతి సంతోషంతో రాజులందరూ చూస్తూండగా తన చేతిలో గల పూలహారాలను రెండు చేతులతో నలుని శిరస్సుమీదగా కంఠాన్ని అలంకరింపజేసింది. "జయ విజయీభవ" అంటూంటే ఒక మూల మంగళవాద్య ధ్వనులు మ్రోయుచుండగా భీమరాజాదులు వెంటరాగా నల దమయంతులు రాజప్రాసాదానికి వెళ్ళారు.

మంచి తిథి వార నక్షత్ర వేళ సుముహూర్తమున సకల వైభవోపేతంగా నల దమయంతుల వివాహం జరిగింది.

ఆ సమయమందు యింద్ర యమ వరుణ కుబేరులు వారు వ్రేల్చిన యజ్ఞమునందలి హవిర్భాగాలను సంతోషంతో స్వీకరించారు. విశేషం ఏమంటే సాధారణంగా దేవతలు అగ్నిముఖంగా హవిర్భాగాలను గైకొనువారే అయినా ప్రస్తుతం వారు నిజరూపాలతో ఇంద్రుడితో కలిపి హవిర్భాగాలను స్వీకరించారు.

## ఇంద్రాదుల ఆశీస్సులు

మంగళ మధుపర్కాలను ధరించియున్న కల్యాణ దంపతులయిన నల దమయంతులను అసూయా ద్వేషాలు విడిచి సంతృప్తితో యింద్రాది దేవతలు తమకు నమస్కరింప వచ్చిన నలదమయంతులకు వరాలు ఒసంగినారు. ఇంద్రుడు "సకల భోగాలు కలుగుగాక!" అని ఆశీర్వదించాడు. యముడు "నలసార్వభౌమా! సర్వదా నీ మనస్సు ధర్మ పరాయణమై ఉండునుగాక" అని దీవించాడు. వరుణుడు కావల

సిన వేళ "ఏ సాధనం లేకయే జలం ఉద్భవిల్లునుగాక" అని ఆశీస్సులిచ్చి కుబేరుడున్నూ దీవించి తమ స్థానాలకు పోవు చుండిరి.

మరియు విదర్భాధిపతియైన భీమరాజున్నూ స్వయంవరానికి వచ్చిన రాజన్యవరులను యథోచిత రీతిని మర్యాదలు సల్పి బహుమానాలిచ్చి బ్రాహ్మణాదులకు భూరి దక్షిణలిచ్చినాడు. వివాహానంతరం వచ్చినవారు అందరూ తమ తమ నివాసములకు వెళ్ళిపోయారు.

## ఇంద్రాదులు కలిని కలియుట

దేవతలయిన యింద్రాదులుకూడా స్వయంవరానంతరం స్వర్గానికి పోవుచుండగా వారికి కలి పురుషుడు ఎదురుగా వచ్చాడు. అతన్ని చూస్తూన్న దేవరాజు "ఓఁ ఏమయ్యా కలీ! ఏఁవిటి విశేషం? ఎక్కడికి బయలుదేరి హడావిడిగా వెడుతున్నావు?" అని ప్రశ్నించాడు.

కలి వారితో "ఓ దిక్పాలకులారా! మీరు నన్ను యిలా ప్రశ్నిస్తున్నారేమి? ఎరుగరా లేక? విదర్భరాజ పుత్రిక అయిన దమయంతికి స్వయంవరం అని మీకు తెలుసా తెలియదా? ఆ స్వయంవరానికి నేనూ ఓ వరుడుగా ఆ ప్రేమ మాలిక కంఠమందు ధరించాలన్న ఆశతో త్వరత్వరగా పోవు చున్నాను. స్వయంవరంలో ఆ దమయంతి నాకే దక్కుతుంది. అక్కడ నన్ను మించినవాడెవడుండును? తప్పకుండా ఆమె నన్నే వరించుతుందని ఆ అదృష్టం కోల్పోవడం దేనికి అని ఎకాయెకీన అక్కడికి పోతున్నాను. మీరిక్కడ నన్ను

ప్రశ్నలడుగుతూ సమయం దాట పెట్టకండి. నన్ను పోనీండి." అని అంటూన్న కలి పురుషుడి మాటలను విన్న ఇంద్రాదులు పెద్దగా నవ్వుకుంటూ "కలీ! ఎంత అమాయకుడవు?" అని మళ్ళా నవ్వుతూన్న ఇంద్రాది దేవతలను కుర కుర లాడుతూ చూసి "నా మాటలు మీ కేమైనా వేళాకోళంగా అనిపించాయా? లేక నేను స్వయంవరానికి పోవడం ఏమిటా అని పరిహాసించుతున్నారా?"

"ఓ కలీ!" ఇంద్రాది దేవతలు అన్నారు. "స్వయంవరం జరిగిపోయింది. నువ్వు శ్రమపడి వెళ్ళనక్కర్లేదు."

"ఆఁ ఏమి స్వయంవరం అయిపోయినదా?"

"ఆఁహా! అందులో పాల్గొని నిరాశులమై చిన్నపోయిన ముఖాలతో స్వర్గానికి పోతున్నాం. ఎందరో రాజకుమారులు బుద్ధిమంతులు కొందరు, సుందర విగ్రహాలు కొందరు. అందులోనివారమే మేమున్నూ. వీరందర్నీ కాదని నిషధ దేశాధీశుడైన నల చక్రవర్తిని వరించి స్వయంవర మాలికను వాని శిరమునుండి కంఠం అలంకరింపజేసినది ఆ విదర్భ రాజకుమారి దమయంతి. కాలాతీతం అయి వెళ్ళిన పొందనగు ఫలం ఏమిటి? వ్యర్థ ప్రయాసమేకదా? సరే నీ ఇష్టం" అని అతని వెర్రితనాన్ని నవ్వుకుంటూ విమానారూఢులై తిరిగి స్వర్గం వైపుగా ప్రయాణం సాగించారు.

ఇంద్రాదుల మాటలు వింటూన్న కలిరాజు నిలువునా హతాశుడైపోయాడు. ఏం చెయ్యక విషణ్ణుడై ఒక్కసారి అలాగే నిల్చుండిపోయాడు.

కలి అనుకున్నాడు "ఆలస్యమమృతం విషం అనగా యిదేనన్నమాట. ఎటువంటి తరుణం దాటపెట్టుకున్నాను. నే పొందవలసిన అదృష్టాన్ని ఎవడో పనికిరానివాడు తన్నుకుపోయాడు. ఆ ఒప్పులకుప్ప నాకై వేచివుండి ఆ స్వయంవర మాల నా కంఠాన్ని అలంకరింపజేస్తుందనుకున్నా."

"నలుడో గిలుడో దద్దమ్మగాడు. చూస్తా ఆ ముద్దుల గుమ్మతో కాపరంచేసి ఎలా సుఖిస్తాడో. ఇలాంటి డింభకుడు అంతటి అలాంటి ఆమెను వివాహానికి కోరి ప్రేమించి ఏం చెయ్యగలడు? హా! హా! మాలాంటి గొప్పవాళ్ళు పొంద దగిన ఫలాన్ని యిలాంటి అల్పకుడు చేపట్టి మిడుములపాలు కావడంకంటే చేయదగిన దేముంది?"

"నల దమయంతులను మా యోపాయంతో విడదీసి పలుకష్టాలు పెడతా. రాజ్యభ్రష్టుని చేసిపారేస్తా" అని తలచి కోపంతో కదలిపోయాడు ఉపాయం యోచించుకుంటూ.

అనంతరం నలుడికి యిష్టం ఏమో ఆలోచించి జూదం ఆడ్డం అంటే నలునికి మహా వ్యసనం అని గ్రహించి ద్వాపరుడనువాణ్ని పాచకలలో ప్రవేశించమని ఆ పాచికలు పట్టుకుని నిషధ రాజ్యంలో ప్రవేశించి సమయంకోసం నలుని వెంటాడుతూ పరిభ్రమిస్తున్నాడు కలి బుసలుకొడుకూ.

దమయంతిని తీసుకుని నలమహారాజు తన రాజ్యానికి వచ్చి పలురకాల యజ్ఞయాగాదులు విశేష దక్షిణలిచ్చి పుణ్య కర్మలయందిష్టుడై నలుడు కాలం గడుపుతున్నాడు.

# నలుడు కలితో తలపడుట

నలుడిపై పగబూనిన కలి ఎట్లాగైనా నలుని పలురకాల ఇక్కట్లపాలు చేయాలనే చెడు సంకల్పంతో నలుని రాజ్యం అంతటా దురాచారాలను వెదకుచు తప్పులను పట్టడానికి ప్రయత్నించుతూ అప ప్రచారంతో అదృశ్యరూపంలో పరి భ్రమించుతున్నాడు.

ఇది ఇట్లా ఉండగా నల దమయంతులకు ఒక కుమారుడు, ఒక కూతురూ జనించారు. ఆ రాజ కుటుంబం ఏ విధంగానూ కొదువ లేకుండా సంతోషంగా ఉంటున్నారు.

కష్టాలు రాబూనినప్పుడు ఎంతటివారికైనా బుద్ధులు పెడదారి పడతాయన్నట్లుగానే నలుడు ఒకసారి సంధ్యాకాలం సమీపించుతూన్నదని త్వరపడుతూ గబగబా ఉదక స్పర్శ చేసి పాదాలను కొద్దిగా కడుక్కోడం విస్మరించి సంధ్యో పాస్తి సలిపాడు. అశుచిగా జేసిన అటువంటి అకార్యానికి పాల్పడ్డ నలుని గమనించి మంచి సమయం దొరికిందని వెను వెంటనే నలుని ఆవహించాడు కలి.

అనంతరం నలునికి ప్రియబంధువగు పుష్కరుడను వాని చెంతకుపోయి తన చెడు తలంపుకు అనుగుణంగా కలి పుష్కరుడితో మంతనాలు చేయడం మొదలుపెట్టాడు. దుష్టులకి దుష్టులు తోడ్పడ్డం సహజమైనదే కదా!

## కలి పుష్కరుల దురాలోచన

కలి పుష్కరుణ్ని సమీపించి నమ్మకం కలిగించేలా మెలుగుతూ అతనితో ఇలా అన్నాడు. "ఓయీ! పుష్కరా! ఏమిటి నువ్వు ఇలా మందంగా ఉన్నావు? నీకు అదృష్టం పట్టబోతోందన్న సంగతి తెలుసుకో."

ఆ మాటలు విన్న పుష్కరుడు కలితో "నీ మాటలు నాకు అర్థం కావడంలేదు. కొంచెం సూటిగా చెప్పు. నాకు అదృష్టం పట్టడం ఏమిటి? అదెట్లు సంభవం? చెప్పు చెప్పు" అని కొంచెం దగ్గరగా వెళ్ళి ఆశగా అడిగాడు.

దానిపై కలి అన్నాడు "పుష్కరా! నేనో యుక్తి చెప్తాను. నువ్వు అలా చేసావా నీ అదృష్టం పంటకొస్తుంది. నువ్వు ఇంద్రభోగాలతో తులతూగగలవు సుమీ! పోతే మీ విషయంలో నువ్వు చేయవలసింది కొద్దిమాత్రమే. అది అంటే ఆ పని చాలా చిన్నదే అయినా చాలా గొప్పది పైగా అసాధ్యం అయిందీను కూడా.

పుష్కరుడన్నాడు "అదెట్లు!" పుష్కరుడన్నాడు "కంగారుపడక జాగ్రత్తగా వినుమరి. నీకు కొన్ని మాయ పాచికల్ని యిస్తాను. వాటిని తీసుకొని నలుడి దగ్గరకు వెళ్ళి సరదాగా జూదానికి రమ్మని పిలు. జూదం అన్నం అంటే మంచి ఇష్టం ఉన్నవాడు కనుక నలుడు కాదనడు. పైగా నేను అతన్ని ఆశ్రయించి ఉండి 'సరే' అనిపిస్తానుగదా! ఆ అక్షక్రీడలో ఈ మాయపాచకలను ఉపయోగించు. అతనిలో ఉండి ప్రతి పదంలోనూ నీవైపు మొగ్గేలా నే

నాటకం ఆడిస్తా. ఆ పాచకలు మన యిచ్ఛవచ్చినట్లు మారతాయి. అప్పుడు విజయం మనది.

మెల్లిమెల్లిగా ఒక్కొక్కటే ఒడ్డేలా ఆవేశం కలిగించుతాను. క్రమంగా జూదం ఆడినంతసేపు ప్రతి క్రీడలోనూ గెలుపు మనది; ఓటమి అతనిది. అప్పుడు నువ్వు పుష్కర మహారాజువి. అఖిల వేలావలయిత సర్వం సహా చక్రానికి నువ్వే సార్వభౌముడవు. సమస్త రాజైశ్వర్యాలతో సకల రాజభోగాలను చిత్తుగా అనుభవించు. దేశప్రజలు నీమీద నీ పాలనమీద మక్కువపడేలా నే ప్రచారం సాగించుతా. అయితే ఏ దుష్ట వ్యసనాలకీ మాత్రం పోకు. ఊరికే నువ్వు అలా ఉండు. నేను నీకు కావలసినవన్నీ సాధించి నిన్ను పెద్ద చేసి నీకో పెద్ద స్థానం లోకంలో కలిగిస్తా. జయ! విజయీభవ! ఇవిగో పాచకలు తీసుకో" అని ఇచ్చి "పుష్కర మహారాజుకి జై" అంటూ కలి మాయమై ఎటో పోయినాడు.

ఈ పథకానికి ఎంతో సంతోషించి పొంగిపోతూ తన మనస్సులో ఇలా అనుకున్నాడు.

"అదృష్టం తన్నుకు రావడం అంటే ఇదే అనిపిస్తోంది. లేకపోతే ఏ పనీ పాటా లేక గోళ్ళు గిల్లుకుంటూ ఆ అరుగు మీదా అక్కడా ఆంబోతులా నిద్రపోతూనో మేల్కొంటూనో రోజులు చికాగ్గా ఉండి గడుస్తూన్న కాలంలో సామంతరాజుగా కూడా ఉండడానికి పనికిరాని నాకు—ఆహా! సార్వభౌమత్వం! వాహ్! నా అదృష్టమా జై! మనుష్యుడి జీవితంలో ఒక్కొక్కడికి ఓ దశ అందుకుంటుందంటారు. అలాంటిదేదో వచ్చింది."

"నలుడైతే చాలా గొప్పవాడు మంచివాడు. అతనితో పోల్చిచూస్తే నాలో ఒక్క మంచి గుణం కూడా లేదని నాకే తెలుసు. ఇలాంటి అర్థాంతరపు సిరిసంపదలవల్ల నా బ్రతుకేమౌతుందో? అటువంటి నలరాజుని మాయ చెయ్యడం తప్పేకదా!"

"అసలు నే పుట్టింది తప్పులు చెయ్యడానికే. లోకంలో నా బోటిగాడు కలిలాంటి వాళ్ళూ ఉంటారు. ఇలాంటిదే మా జీవిత లక్ష్యం. లోకగమనంలో మాలాంటి భ్రష్టులకి కూడా ఒకోసారి మంచిరోజులు వస్తూంటాయి. అటువంటప్పుడు మాలాంటి వెధవలందర్నీ పైకి తీసుకొస్తాం. ఇప్పుడు నే చేసే పని ఏమిటి? నా చుట్టూ ఉన్న వాళ్ళెవరు? వట్టి బోడి మాయగాళ్ళు. వాళ్ళందరికీ నే పెద్ద పదవులు ఇవ్వాలి. ఇస్తాను కూడా. మేం అందరం ప్రఖ్యాత మాయావులలో పెద్దవాళ్ళం. మా అబ్బురాజు అంటే తాగుడు కొట్టు దగ్గిర ఉంటూ వ్యభిచార స్త్రీలని వేళాకోళాలాడే చవట లేడు? వాడే రేపటినుంచి మండలాధిపతి. రాత్రిళ్ళప్పుడు చిన్న కత్తి పట్టుకు హాస్యగాడిలా బూతులరుస్తూ "ఎవడ్రా సంపేస్తా" అని పాచి సంతల్లో తిరిగే తాతాలుగాడు లేడూ? వాడే రేపటినుంచి మహామండలాధిపతి. వ్యాపారపు అంగళ్ళ దగ్గిర కర్ర పెత్తనం చెలాయించే మల్లిగాడు రేపటినుంచీ మల్లేశ్వరాధిపతులంగారు—సామంత ప్రభువు. సానిదాన్ని ఉంచుకుని కొంటిదాంతో కాతా పెట్టుకున్న మరిడిగాడు లేడు. వాడే రేపటినుంచీ గ్రామ పెద్ద శ్రీ శ్రీ శ్రీ మరిడేశ్వర ప్రభువులంగారు. ఇప్పుడు చూడాలి దేశం పరిస్థితి. మను

స్మృతి మంట కలుస్తుంది. గీత మత ధర్మ సూత్రం గంగలో దిగుతుంది. ఏది యీ బడా బిళ్ళపంచి కట్టుగాళ్ళూ పిండికట్లు పెద్దలూ పెళ్ళాల్ని పట్టుకుని యెలా యేమిస్తురో ఆ గాథలు చూడాల్సిందే మరి. ఇక వర్తకం ఒంటితలుపు తెరిచి దోచేసే దొంగలిదే మంచి తరుణం.

ఇటుపై మాకు నచ్చిన రీతిలో మేం గౌరవ కితాబులు రాయించుకుంటాం. మా మరిడగాడొచ్చి యీన నామీద పజ్జాలు రాశారు మావా! ఈనికి "ఆంధ్ర కవితా కొమ్ము లిరిగినవాడు" అని బిరుదు ఇమ్మంటే ఊఁ! మంజూరు. అది చూసిన మా తాతిగాడు ఓ పంతులోణ్ణి తీసుకొచ్చి బాబయ్యా. ఈడికో బిరుదిమ్మంటే "ఆంధ్ర కవితా హేమా హేమీ" అని ఇచ్చేస్తాం. సేతకాని రీతిలో సన్మానాలందు కుంటాం. సభలూ, సన్మానాలూ పొందుతూ పెద్ద పెద్ద పూలదండలు ముంచెత్తేలా వేయించుకుని భుజాలెగరేస్తూ తిరుగుతాం. ఆ బ్రహ్మ సృష్టిలో ఏరోజు ఎలాంటిదౌతుందో ఏం తెలుసు. ఈ రోజు మాది. "మాకు-జై, మేం జిందా బాద్! "ఈ బడాబడాలు అందరూ రేపు మమ్మల్ని చూసి ఇలాగే అంటారు. అనకపోతే—రాజ్యం మాది సేవకులచే తన్నించైనా అనిపించుకుంటాం" అని పగటి కలలు కంటూ "ఆలస్యం దేనికి నలరాజు వద్దకు పోయి గ్రంథంలోకి దిగుతా" అని కలి దీవించి ఇచ్చిన పాచకలతో వాటిని ముద్దు పెట్టు కుంటూ నలుడి దగ్గరకు పోయాడు పుష్కరుడు.

## పుష్కరుడు నలుని వంచించుట

"అఖండ భూమండలోద్దండా ఖండల సమానా! నల సార్వభౌమా! జయము! జయము!" అని వందులు కీర్తించు తూండగా నలచక్రవర్తి సింహాసనారుఢుడైనాడు. అంతలో దేవ్వారికుడు ప్రవేశించి "జయము జయము మహారాజ!" "ఏమది?" "తమకోసం ద్యూతక్రీడా పరాయణుడైన పుష్కరుడను క్రీడాకారుడు ద్వారంవద్ద తమ దర్శనం కోరి నిల్చున్నాడు."

"ప్రవేశ పెట్టుము" అని నలుడన్నాడు.

అంతలో ఇరువురు విప్రులు వచ్చి "మహారాజ! ప్రస్తుతం కాలం చెడుగా మారబోవుచున్నది." అనగా నలుడు "బ్రాహ్మణులారా! రాణిగారి చెంతకుపోయి ఈ విషయాలు వారికి చెప్పుకోండి. ప్రస్తుతం మీ మాటలు వినుటకు నాకు తీరిక లేదు" అని నలుడా విప్రులను పంపివేసినంతలో ద్వారపాలకులు పుష్కరుణ్ణి సభలోనికి ప్రవేశ పెట్టారు.

వానిని చూసి నలుడు "పుష్కరా? మా వలన నీకు కలుగగల ప్రయోజనమేమి?" అనగా పుష్కరుడు "అన్ని విధాలా సకల వినోదాలతో కాలం గడుపుతున్నారు కాని తమకు ప్రీతిపాత్రమైన జూదం పాచకలతో ఆడవేడుక అగుచున్నది." అంటూండగానే వ్యసనమందు ఇష్టం పడుతూన్న నలుడు కలి ప్రభావం కారణంగా "సరే అట్లే కానిమ్ము" అని చిరునవ్వు ముఖం మీద చిందులాడగా నలుడు పుష్కరుడితో జూదమాడ్డానికి సిద్ధపడ్డాడు.

## అక్ష క్రీడ

నలుడు పుష్కరుడూ జూదశాలలో అక్ష క్రీడకు కూర్చున్నారు. అప్పుడు నల మహారాజుతో పుష్కరుడు మహారాజ! యీ పాచకలున్నాయే నాకొక మిత్రుడు నా జూదం ఆడిన తీరును చూసి నాకు వీటిని బహూకరించాడు. చాలా మంచివి. అక్ష క్రీడలో మీకుగల ప్రజ్ఞాపాటవాలకు యీ పాచకలు చక్కగా ఉపయోగపడును. కాన వీటితో ఆరంభించుదమా?" "పాచకలలో ఏం వుంది. మనం ఎలా వేస్తే అలా పడతాయి. మన ఆటలో ఉండాలికాని సత్తువ. కానీ మొదలుపెట్టు" అని నలుడనగా పుష్కరుడు జూదం ఆరంభించాడు. మొదటగా పందెం ఒడ్డారు చిన్న వస్తువులని. మొదటిసారిగా ఓడినట్లు పుష్కరుడు నటించి గెలుపు నలుడికిచ్చాడు. నలుడన్నాడు "నాతో నువ్వేం ఆడగలవు? ఈ ఆటలో నువ్వో బచ్చాగాడివి. బొత్తిగా తెలియని వాడవులా కనబడుతున్నావు?" అనగా "కాదు మహారాజ! ఇదిగో ఈ విలువైన హారాన్ని ఒడ్డుతున్నాను. ఆడండి ప్రభూ!" అని మరల జూదం మొదలుపెట్టారు. ఈసారి పుష్కరుడే గెలుపు సాధించాడు. తిరిగి గెలిచిన మొత్తంతో పాటు ఇంకా ఒడ్డాడు పుష్కరుడు. మళ్ళా ఆటలో పుష్కరుడే గెలిచాడు. మళ్ళా అల్లే ఒడ్డాడు. మళ్ళీ గెలుపు పుష్కరుడే కొట్టాడు. ప్రభూ! చిన్న మొత్తాలు కాక పెద్ద మొత్తాలతో దిగండి. అప్పుడు ఆట రంజుగా రక్తి కడుతుంది." "ఊఁ అలాగేకానీ నా కోశాగారం ఒడ్డుతున్నాను." ఇదిగో ఆట అనగా పుష్కరుడు "గెలుపు నాది రాజ!" అని మరల

మొదలుపెట్టాడు. ఈసారి నలుడు నా అంతఃపురంలోగల కనకరత్నాభరణాలన్నింటినీ ఒడ్డుతున్నా. ఈసారీ నాదే గెలుపు" అని నలుడు ఆట ఆడాడు. కాని గెలుపు పుష్కరుడిదే అయింది. "పుష్కరా! ఇదిగో ఈసారి యీ నా అమూల్య కిరీటాన్ని ఒడ్డుతున్నాను." "గెలుపు నాదే రాజ! నేనే నెగ్గాను." అని తమకంతో ఆట రోషావేశాలతో నిండిపోయింది. ఈ సంగతిని బుద్ధిమంతురాలయిన దమయంతి కనిపెట్టసాగింది.

ఇంతలో కొందరు బ్రాహ్మణులు వచ్చి "అమ్మా! రాణిగారు! అపశకునాలు కానవస్తున్నాయి. సమయం చాలా చెడుగా మారనున్నది" అని చెప్పి వారు వెడలిపోగా దమయంతి అంతట పెద్దలనూ మంత్రులనూ రప్పించి నల పుష్కరుల జూద ఫలితాల్ని అంచనా వేయసాగింది. బ్రాహ్మణులు చెప్పిన దుశ్శకున ఫలితాల్ని కూడా పరిగణనలోకి తీసుకుని ఆలోచింపసాగింది. తన భర్త ఓడిపోవునని యిందేదో కుట్ర ఉందని పెద్దలతో యోచించి తానొక నిర్ణయానికి వచ్చింది.

రథసారథి అయిన వార్ష్ణేయుడను వానిని రహస్యంగా రప్పించి ఇంద్రసేనుడను కుమారుణ్ణి, కూతురైన ఇంద్రసేన అనుదానిని చూపించి ఓ వార్ష్ణేయా! ప్రస్తుతం మన రాజు ఒక మాయావితో జూదవ్యసనంలో యించుమించుగా అంతా ఓడపోతున్నారని వార్తలు తెలుస్తున్నాయి. ఈ ఇద్దరు చిన్న పిల్లల్నీ శీఘ్రంగా తాతగారి ఇంటికి క్షేమంగా తీసుకువెళ్ళు. ప్రస్తుత పరిస్థితిని చూస్తే ప్రమాదం ఏదో ఘోరంగా రాబోతూన్నట్లు తోచుచున్నది. ఏం కష్టాలు వచ్చినా నేను,

నా భర్తయు సహించుచుతాం. కాని యీ చిన్నారులు పాపం కష్టాలని తట్టుకోలేరు. అందుకని యిప్పుడే రహస్యంగా తీసుకువెళ్ళి తాతగారి ఇంటివద్ద దింపిరమ్మని ఆ పిల్లలని అతనికి వప్పగించి పంపివేసెను.

రథసారథి అయిన వార్ష్ణేయుడు దమయంతి ఆజ్ఞ ప్రకారం ఆ చిన్నారి పాపలను రథంమీద కూర్చుండబెట్టుకుని తల్లీ పిల్లల యెడ బాటుకు చింతిస్తూ విదర్భ దేశానికి వెళ్ళిపోయాడు.

## నలుడిపై పుష్కరుడి ఘనవిజయం

ఇక నలుడు పుష్కరుడితో జరుగుతూన్న జూదం ఆటలో చివరికి తన రాజ్యాన్నీ ఇంకా ఉన్న సర్వస్వాన్నీ మైకం ఆవేశం క్రమ్ముకోగా జూదంలో ఒడ్డి ఓడిపోయాడు.

అంతటి ధర్మయుతుడైన రాజయి కూడా నలుడు ఓ మోసగాడి చేతిలో కలి ప్రభావంవల్లనో అనుకూలించని విధివల్లనో నైషధుడు ఆ స్థానంలో పుష్కరుణ్ణి ఆ దేశాధిపతి అంగీకరించాడు.

పుష్కరుడు తన పాచిక పారినందుకు నలుడి యెదుట రాజ్యాధిపతిగా ప్రకటించుకునే అదృష్టానికి నోచుకున్నందుకు ఉబ్బి తబ్బిబ్బై పోతూ అందరి సమక్షంలో సింహాసనం అధిష్టించాడు. తలవని తలంపుగా వచ్చిన రాజ్యానికి పెల్లుబికిన సంతోషంతోనూ అన్యాయంగా ఆర్జించిన రాజ్యం కావడం వల్లా అటువంటి ధర్మాత్ముడైన మాజీ రాజు తన యెదుట నుండుటకు ఇష్టపడక నలదంపతులను తన రాజ్యం విడిచి

పోవాలని తక్షణం ఆజ్ఞలను పుష్కరుడు జారీ చేశాడు. పైగా ఆ దంపతులకు ఎవ్వరూ ఏ విధంగా ఉపకరించడంగాని సహాకరించడంగాని చేయరాదనికూడా తన పౌరులను ఆదేశించాడు.

తన సహచరుల ద్వారా ఆ దంపతులపై అపనిందలూ వదంతులూ వ్యాపింపజేయసాగాడా పుష్కరుడు. "బద్దని వారించుతూన్నా పెద్దల్ను దుష్ట వ్యసనానికి పాల్పడ్డాడు నలుడు. ఫలితంగా రాజ్యభ్రష్టుడయ్యాడు. ఇది కోరి చేసుకున్న తప్పు అంటూ పుష్కరుడు ఇతరులూ ములుకుల్లాంటి పలుకులాడసాగారు.

అటు తరువాత కొంతసేపటికి రాజ సేవకులు వచ్చి రాజాజ్ఞను ఉల్లంఘించక రాజ్యాన్ని విడిచిపోవలయునను వాక్యాలు వారికి వినిపించి వార్ని రాజ్యంనుంచి పంపివేశారు.

చేయునది లేక రాజాజ్ఞ ప్రకారంగా నల దమయంతులు కట్టుబట్టలతో వీధుల వెంబడి వెళ్ళిపోసాగారు. అలా నడుస్తూ నడుస్తూ ఎట్టకేలకు నగర శివార్లకు చేరారు.

## నలుడు నగరం విడుచుట

ఆ విధంగా పుష్కరుడిచే నగరంనుండి బహిష్కృతులయి నగరం వెలుపలికి పోయి ఎక్కడో కాస్త ఉండటానికి తగిన తావును చూసుకుని రెండు మూడు రోజులు ఆకలి దప్పులతో బాధపడుతూ తమ దయనీయ స్థితిని గమనించిన వారెవరైనా వచ్చి ఆదుకుంటారేమో అని ఆ నల దమ

యంతులు ఆశించారు. కాని ఎవ్వరూ పుష్కరుడి శాసన ధిక్కారం చెయ్యడానికి సాహసింపక పైగా అతని తప్పిదాన్నే పలుమార్లు ఏకరువు పెట్టసాగారు.

అంతటి రాజుకి ఇంతటి విపద్దశ తలపనంతలో ఏర్పడిన దంటే విధి విలాసం కాక మరేమిటి? పుష్కరుడి ప్రచారం మూలంగానూ కలి ప్రభావం కారణంగానూ చెడు పనివల్ల సర్వస్వాన్ని పోగొట్టుకున్న నలుని యెల్లరూ దూషించువారే అయ్యారు. అతడి దుస్థితిని "పాపం" అని జాలిగొన్నవారే లేరైరి.

## నలుడాకలి దీర్చుటకు ప్రయత్నించుట

నిద్రాహారాలు లేక నల దమయంతులు తమకు కలిగిన యిక్కట్టుకు ఎంతగానో మనస్సులో కుమిలిపోతూ ఆ వేదనతో రెండు మూడు రోజులు కష్టంమీద వెళ్ళించారు.

అంతఃపుర స్త్రీలతో సేవ్యమాన అగు దమయంతి అల్లరి పిల్లలు తెంపి గట్టుమీద పారేసిన కలువ తూడులా వాడిపోయి ఉంది.

అటువంటి దమయంతినిచూస్తూన్న నలుడు ఏం ఆహారం సమకూర్చను? ఎలా సమకూర్చను? ఏ ఉపాయంచే దమయంతికి ఆహారాన్ని తెచ్చి పెడుదును? అని తలపోస్తూండగా అంతలో కొన్ని పక్షులు వచ్చి ఆ చెంతనే వ్రాలాయి.

వాటిని చూస్తుండగా నలుడికి మనస్సులో ఓ ఆలోచన కలిగింది. ఏమంటే ఆ పక్షుల్ని కొన్నింటిని పట్టుకున్నా

ఆ పక్షి మాంసంతో కొంత ఆకలి తీర్చుకోడానికి వీలు కలుగుతుందని ఎంచి తన ఒంటినున్న వస్త్రాన్ని విప్పి మెల్లగా ఆ పక్షుల్ని చడీ చప్పుడూ లేక చేరి వాటిపైకి కట్టుబట్టని ఎగరేసాడు. దురదృష్టంవల్ల ఆ పక్షులు ఒక్కసారిగా ఆకాశానికి ఎగిరిపోయాయి.

ఆ దృశ్యాన్ని చూస్తూన్న నలుడు విస్తుపోయాడు. అంతలో ఆకాశం నుంచి ఆ పక్షులు మనుష్య భాషలో నవ్వుతూ ఓయి! నల సార్వభౌమా! కలి పురుషుడి ప్రభావం వలన మేం పాచకలలో ప్రవేశించి నిన్ను రాజ్య భ్రష్టుణ్ని చేసాం. అసలు మా లక్ష్యం నీచే నీ భార్యను విడనాడించుట. అందుకే ఇప్పుడు యీ రూపంలో వచ్చి నిన్ను వంచించిన కలి అంశకు చెందినవారం" అంటూ వస్త్రం గొని అవి ఎటో పోయాయి.

నలుడు తన కట్టు వస్త్రం కూడా పోయినందుకు విచారిస్తూ తాను చేసిన పొరపాటుకి చింతిల్లనారంభించాడు.

"ఇటువంటి దురుద్దేశ్యంతో పుష్కరుడు వచ్చాడని తలచలేదు. ఏదో వెర్రి ఆవేశం వచ్చేసింది. మంచీ మతీ లేకుండా జూదం ఆడేసి సర్వస్వం కోల్పోయా, ఈనాడు చెట్ల నీడలలో ఉండవలసి వచ్చింది. ఇంత దుఃస్థితి వచ్చింది ఆ దుష్ట వ్యసనం వల్లనేకదా! ఎవరు ఎన్నివిధాలుగా వారించినా ఓటమి పూర్తి అయ్యేదాకా ఆ ఆవేశం తగ్గలేదు. ఆ వ్యసనంలో అంతా పోగొట్టుకున్నాను. ఇటువంటి వ్యసనానికి పాల్పడ్డ ఎవరు మంచిగా బయటపడ్డారు? పదిమందికి చెప్పవలసిన నేను ఇటువంటి దుష్టులను పట్టి శిక్షించవలసిన నేను నేనే యీ అకృత్యానికి పాల్పడ్డా. తప్పు చాలా ఖరీ

దైనది; తప్పు చాలా ప్రమాదమైనది. అయిపోయింది. అంతా అయిపోయింది. తప్పుకి తగిన శాస్తి జరిగింది. ఇప్పుడు ఎంత విచారించితే మాత్రం ఏం లాభం!" అని తన భార్య ఉన్న చోటుకి చేతులు అడ్డుపెట్టుకు నడచివచ్చి సిగ్గుపడుతూ దమయంతి ధరించి ఉన్న చీరలోని కొంత కొంగుభాగాన్ని చింపి పుచ్చుకుని దాన్ని అతడు కట్టుకున్నాడు.

ఆ పైన తన భార్యను చేత్తో పట్టుకుని మెల్లిగా నడిపించుకుంటూ అలా అంత దుర్దశని అనుభవించిన ప్రాంతాన్ని విడిచి ఎటు పోవాలో నిర్ణయం లేకుండా ముందుకు నడుచుకుంటూ వెడుతూండగా ఒకచోట మార్గం రెండువైపులుగా పోయే దారులయింది. వాటిలో ఒక దార్ని చూపించుతూ "ఓ వైదర్భీ! ఈ దారి చూశావుకదా. ఇది తిన్నగా చేది నగరానికి పోతుంది. ఇంకోటి ఉంది చూసావు! అంటే యిది విదర్భకి పోయేదారి. ప్రియభార్యా! ఇప్పుడు మనం ఏ దారంపట ఎటు పోదామంటావు?" అని నలుడు దమయంతిని చూస్తూ అడిగాడు.

ఆ మాటలు విన్న దమయంతి తన పతిని చూసి "నాథా! ఈ అడవులవెంట తిరుగుట యేల? మనము విదర్భా పురానికి పోవచ్చునుగదా! అది మీకునూ, నాకునూ వాసయోగ్యమైనది. వేరుగా భావింపక మనము విదర్భా పురానికి వెళ్ళి అక్కడ కొంతకాలం సుఖంగా ఉన్న పిమ్మట కర్తవ్యం ఆలోచింపవచ్చును. అక్కడా యిక్కడా సంచరిస్తూ ఓ గమ్యం లేకుండా ఉంటే దానివల్ల కలిగే లాభం ఏముటుంది కనుక? పోనీ ఈ అడవులలో తిరుగుదామా అంటే

క్రూరమృగాలతో పోరాడుతూ ఇంకా కష్టాల్లోకి పోతాం. కాబట్టి విదర్భాపురానికి వెళ్ళడమే అన్నివిధాలా తగింది" అని అనగా నలుడు దానికి బదులు యిలా పలికాడు.

"ప్రియభామా! ఒకప్పుడు గొప్ప ఐశ్వర్య సంపదలతో తులతూగుతూన్న కాలంలో విదర్భలో ఉన్నా. ఇప్పుడు సర్వస్వం పోగొట్టుకుని అక్కడ మసలడానికి చిన్నతనం అనిపిస్తోంది" అని నలుడు చెప్పగా విని దమయంతి భర్తతో ఇలా అంది.

"ప్రియ పతీ! మీరు ఒంటరిగా మసలజాలరు. భార్య లేని బ్రతుకు చాలా బాధాకరమైనది. భార్యతో ఉన్నచో ఎటువంటి బాధలయినా మనస్సుని బాధించవు. రోగికీ, దుఃఖ బాధలుగలవానికీ, వ్యసనపరునికీ భార్య ఉన్నచో ఎట్టి బాధలూ కూడా బాధలుగా కనిపించవు. కనుక నన్ను విడిచి ఒంటరిగా ఉండటానికి ప్రయత్నింపకండి స్వామీ! మీ పాద దాసిని మీ పాద పద్మసేవ నాకు ఎల్లవేళలా ఉండేలా నన్ను అనుగ్రహించండి. నాథా! శ్రమచే అలసినవేళా, ఆకలివేళ, దప్పిక కలిగిన యెడ భార్య ఉంటే ఏ బాధ లేకుండా చేయును.

ప్రియ పతీ! నా జీవనం మీ జీవనంతో ముడివడినది. అవినాభావ సంబంధంతో పెనవేసుకుపోయినది. సదా నేను మీ మాటను దాటక మిమ్ము అనుసరించి ఉండేదానను. ఉండవలసినదాన్నీ కూడా! కాన రాజా! నన్ను మిమ్ము వెంబడించనీయండి. ఆ భాగ్యమును నాకు కలిగించండి." అని ప్రార్థించుతూన్న తన అనుగు భార్య మాటకు ఎదురుచెప్పక "ప్రియ పత్నీ! నువ్వు నా ప్రాణసమానురాలవు. నీ చిత్తం

వచ్చినట్లే కానిమ్ము" దమయంతిని ఓదార్చి ముందు ముందుకు కాలినడకను వెళుతూండగా ఆ అడవిలో ఒకచోట ఒక విడిదిని చూసి భార్యయు తానూ దుమ్ము ధూళితో నిండిఉన్న అటువంటి చోటుననే కాస్త బాగుచేసుకుని అక్కడ విశ్రాంతిని తీసుకోదలచి నలుడు పరుండినాడు. దమయంతి అతని పాదములు ఒత్తుచూ అలాగే అతని పాదాల చెంత నిద్రించుతూంది.

అప్పుడు నిద్రనుండి లేచి నడక వలన శ్రమపడి నిద్ర పోతూన్న నలుడు ఇలా అనుకున్నాడు. "పాపం! యీ చిన్నారి జవ్వని తన అనుగు నెచ్చెలులు శరీరానికి సేవలు చేస్తూండగా కోమల శయనంమీద పరుండే పూబోణి నేడు దుమ్ములో నిద్రకై పొరలాడుతోంది. ఇటువంటి మనోహరాంగి నాకు భార్య అయి ఎన్నో పడరాని యిడుములు పడుతోంది. ఇలా నా కళ్ళఎదుట హీనదశని అనుభవించుతూ నే చేసిన తప్పులకి ఆమె కష్టాలుపడుతోంది. ఇటువంటి స్థితిని దమయంతి పొందడం నే చూడలేను. నేను కనక ఆమెని విడిచి దూరంగా పోయినట్లయిన అప్పుడామె తన బంధువుల యింటికి చేరి సుఖంగా ఉండగలదు" అని యోచించి ఆమె గాఢ నిద్రలో ఉండగా మెల్లిగా అలికిడి కాకుండా లేచి కొంతదూరం నలుడు వెళ్ళాడు.

విడిచిపెట్టి వెళ్ళడానికి మనసు పడక నలుడు మరల నిద్రించుతూన్న దమయంతి చెంతకు వెళ్ళి ప్రేమబంధాన్ని త్రెంచుకోలేక ఆమె కేసి చూస్తూ అలాగే నిల్చుండి ఆలోచనా నిమగ్నుడయ్యాడు.

## నలుడు దమయంతిని విడుచుట

దాసదాసీ జనాలు సేవించుతూండగా రక్షిత ప్రాంతమైన అంతఃపురంలో హాయిగా సకల సుఖభోగాలతో పలు రకాల క్రీడలతో కాలం గడపవలసిన నా ప్రాణవల్లభను ఇలా యీ ఘోరారణ్యంలో దస్యులూ, క్రూరులూ, వన్య మృగాలూ సంచరించే యీ భయంకర కాననంలో ఒకర్తెనూ విడిచి ఎలా దూరంగా వెళ్ళిపోనూ? పోనీ కూడా ఉందామా అంటే ఈ విరిబోణి ఇలా కష్టాలతో కాగిపోతుండవలసిందే.

"పాపకృత్య పరాయణుడైన కలి వెంటాడుతూ అదృశ్యుడై నా సతిని కూడా విడుచునట్లు చేస్తున్నాడు" అని తలపోసుకుంటూ చేయునది లేక అతి కష్టంమీద ముందుకు పోవడానికి కూడా కాళ్ళాడక ఎలాగో హృదయాన్ని కఠిన పరచుకుంటూ ఎటో వెళ్ళిపోయాడు.

అటు తరువాత కొంతసేపటికి మెల్లిగా బడలిక తీరినంతనే పూరేకులలాంటి కనులను దమయంతి విప్పి దశదిశలా కలియచూసింది. అదంతా నిర్జనవనం. ఆ ఏకాంత ప్రదేశంలో ఎక్కడా ఏం కనబడడంలేదు. తన చెంతనే నిద్రించి వున్న ప్రియతమ ప్రాణనాథుడు ఉన్న జాడయే తోచడం లేదు. దమయంతి హడలిపోతూ భయం, చింతా మనస్సుని బెంబేలు పరుస్తుంటే అటూ ఇటూ సంచరిస్తూ "నాథా! ఏమండీ! ఎక్కడున్నారు? ఇక్కడ నే ఒంటరిగా తిరుగాడు తున్నాను" అని గట్టిగా కేకలువేస్తూ గుండెలమీద చేతులు అదుముకుంటూ "ఓ! మహారాజ! ఎక్కడ ఉన్నారండి? ఇలా దర్శనం ఇప్పించండి. గాలిలో కదలాడుతూన్న కోమల

పల్లవంలా కంపించిపోతున్నాను” అంటూ అరుస్తూ ఆక్రందనం చేయసాగింది దమయంతి.

“ఓ నిషధరాజా! ఓ ధర్మమూర్తి! నిజభుజాశ్రితధరామండలాన్ని చాకచక్యంతో పరిపాలింపగ సత్యవ్రతా! ఎన్నో మాటలు చెప్పావు. నన్ను విడనాడనంటు నన్ను నిద్రింపచేసావు. కనులు తెరిచేసరికి ఎక్కడా కానరాకున్నావు. కనులకు కర్పూరంలా కనబడే కనక ప్రభాంచిత కమనీయ రూపాన్ని దర్శింపకుండా నే ఓ క్షణం కూడా ఉండలేనిదానను? ఏం చెయ్యను? ఎటుపోను? ఏది శరణం? స్వామీ! ఒక్కసారి యీ దీనురాలిని కరుణించి దర్శనం యివ్వండి”

“ఓ రసాలమా! పున్నాగ, తిలక, చందన, అశోక వృక్షములారా! నా ప్రియనాథుణ్ని చూపండి. ఆయన కుల ప్రకాశకుడు ఆర్తత్రాణ పరాయణుడు, లోకోపకారకుడైన అతిలోక నాయకుడగు నిషధ భూపాలుని చూపండి” అంటూ పలురకాలుగా రోదిస్తూ ఒకసారి కొండ కోనలవైపు చూస్తూ, అరుస్తూ, ఆక్రందిస్తూ నదీ ప్రాంతాలవద్దకుపోయి బొబ్బలు పెడుతూ ఇంకా గుహాప్రాంతాలకుపోయి ఎక్కడున్నాడో నా నాధుడని భయభ్రాంతురాలగుచూ నలుగడలా పలురకాలుగా అన్వేషింపసాగింది.

ఆ విధంగా తన పతిని వెదకుచు దమయంతి అంతట కాంతారమందు ప్రవహించుతూన్న ఒక పుణ్య నదిని గాంచెను. ఆ ఒడ్డున ఉదకాన్ని మాత్రమే ఆహారంగా తీసుకుని, మరికొందరు ఆకులూ అలములూ భక్షించువారు,

మరికొందరు గాలిని ఆహారముగా గలవారు, పలురకాల కూరగాయలూ నివ్వారిధాన్యం ఆహారంగా తీసుకుని పరిశుద్ధ మనస్సుతో తపమాచరించు మహామునులతో కూడిన ఒక ఆశ్రమాన్ని పూర్వార్జిత పుణ్యాల మూలంగా అల్లంత దూరంలో చూసింది. అది ఒక ఋషి వాటిక.

ఆ ఋషి వాటికయందు ఎక్కడ చూసినా సంతత వేదనాదాలూ పురాణ శ్రవణాలూ శాస్త్రచర్చలూ కావించు చున్న తాప సోత్తములతో వాసిష్ఠ వాలఖిల్య భృగు నారదాది ప్రముఖ మునులను పోలిన మహామునులతోనూ అగ్ని హోత్రశాలల నుండి వెలువడుతూన్న హోమధూమాల పటలాలతోనూ నిండిన ఆ ముని వాటికలోనికి ప్రవేశించింది.

అక్కడ ప్రవేశించగానే ఆద్యాది హవిస్సుల హోమ సుగంధాలు ఘ్రాణానందం చేస్తూంటే తనలోని దుఃఖం కొంత ఉపశమించింది. ఆ పవిత్ర తపోభూములలో అడుగులు వేస్తూంటే ఎంతో శాంతి మనస్సుకి గోచరం ఔతోంది.

ఆ ప్రాంతాలలో నడుస్తూంటే కష్టాలు గట్టెక్కుతూన్నట్లు, కలి బాధ తొలగుతూన్నట్లు, శని బాధ ఉపశమిస్తూన్నట్లు, మనస్సులోని ఆందోళన అంతం అవుతూన్నట్లు, ఆత్మకు ఆశ్వాసం ఆవిర్భావం ఔతూన్నట్లు అనిపించుతూండగా కొందరు మునులు ఆమెను చూచి సమీపించగా దమయంతి వారికి సవినయంగా నమస్కరించింది.

(6)

## ఋషి వాటికలో దమయంతి

"ఎవరై ఉండునో యీ రమణి? వన దేవతయై ఉండునా? లేక ఎవరై ఉండునో యీ సుందర భాగ్యరాశి?" అనుకుంటూ ఆ తాపసేంద్రులు నమస్కరించిన దమయంతిని చూసి యిలా అన్నారు.

"ఓ సుగుణమణీ! నిన్ను చూస్తూంటే మాకు యేదో వింతగా వుంది. నువ్వు ఒక భాగ్య సుందర రాశివి. ఈ ప్రాంతమా? ఒకవంక తాపసులు, ఇంకొకవంక కిరాతులూ, అరాతులూ, దొంగలూ, ఇన్నింటికంటె యెక్కువగా పెద్ద పులులూ, సర్పరాజులూ నడిచే యీ ముళ్ళపొదలతో నిండిన దుర్గమమైన రాళ్ళ మార్గం గుండా నడచివచ్చిన నువ్వు... ఎవరివమ్మా! నువ్వు ఏ విధంగానూ బాధపడనక్కర్లేదు. నీ వినయం నీ ఉత్తమ శీలం నీ ముఖంనుండి వెలువడుతూన్న కిరణ పుంజంతో కూడిన విశాల నేత్రాలు కొంత నీ చరిత్రను తెలియజేస్తున్నాయి. అయినా కొంచెం వివరాలు తెలియ జెయ్యి అని వారు ప్రశ్నించారు.

ఆ మునుల మాటలకు దమయంతి ఇలా బదులు చెప్పింది. "మునివరులార! వినండి; యజ్ఞ యాగాది క్రతువులు చేయుటయందు చాలా ఆసక్తి కలవాడు అగు పుణ్య శ్లోకుడైన నలుని అర్ధాంగిని, గొప్పవారిచే శ్లాఘింపబడు మంచి చరిత్రగల నన్ను దమయంతి అంటారు.

"నా భర్త ఏ కారణం చేతనో నన్ను ఈ కానన సీమలో ఒంటరిగా విడిచి ఎక్కడికో వెళ్ళిపోయినాడు. ఆ మనో నాయకుణ్ని వెదకుచూ మీా ఆశ్రమానికి

వచ్చాను. ఆ ఉత్తమ పురుషుడు మీ ఆశ్రమానికి వచ్చి మీకు నమస్కరించి ఏ దిక్కుగా వెళ్ళివుంటారో దయతో నాకు తెలుపగోరుచున్నాను. కొద్దిరోజుల్లో ఆయనని వెదకి ఆయన దర్శనం చేసుకోలేని పక్షంలో ఈ శరీరాన్ని విడువ గలను" అని దమయంతి ఋషులను నలుని జాడ చెప్పమని కోరగా ఆ మునులు ఆమెపై దయగొని ఆమెతో ఇలా చెప్పారు. "ఓ మంగళప్రదురాలా! నీ మనో వల్లభుడైన జనసుతుడగు నలరాజుని నువ్వు కొద్దిరోజులలో చూడగలవు" అని చెప్పి వారంతట అదృశ్యులవగా అందులకామె ఆశ్చర్య పడుతూ ముందు ముందుకు పోగా అక్కడ ఆ దారిని పోవు ఓ గుర్రపు దండును చూచి వారి చెంతకు పోయినది. ఆమెను చూస్తూన్న ఆ అశ్వికులలో కొందరు చిరిగి మలినమైపోయిన వస్త్రాన్ని ధరించి సంస్కారం లేక శిరోజాలు దుమ్ముతో నిండి ఎగురుతూండగా అలసిపోయి నీరసించిన ముఖంతో ఉన్న ఆమెను చూసి "అయ్యబాబోయ్ దెయ్యం దెయ్యం" అంటూ కేకలు వేస్తూ అటూ ఇటూ పరుగెత్తజొచ్చిరి. నిద్రాహారాలు లేక క్షుత్పిపాసలతో బాధపడుతూన్న దమయంతిని చూసి మరికొందరు "పిచ్చిది పిచ్చిది" అని గొడవ చేయసాగిరి. కొందరు ఆమెను చూసి ఈ అడవిలో ఏం వెతుక్కుంటూ తిరుగుతున్నావు పిచ్చిదానా" అని పకపక నవ్వుతూ హేళన చేశారు. ఇంకొందరు ఆమెను చూసి అమ్మా! నువ్వు నిజంగా దేవతవు వనదేవతవు అంటూ దండాలు పెట్టారు.

ఆ నిర్జనారణ్యంలో యింతమంది అశ్వికులను చూసి "హమ్మయ్య! నా పుణ్యంవల్ల యింతమందిని ఒక్కసారి

ఇక్కడ చూడసాగా. నిజంగా ఇది నా అదృష్టం” అని భావించి వారితో ఇలా అంది.

“నాయనలారా! నేను వనదేవతనూ కాను, దెయ్యాన్నీ కాను ఉన్మాదినినీ కాను. దురదృష్టవశాత్తూ కరుణాపూరితుడూ దేవతలతో సమానుడైన నలుడను వాని భార్యను. మందభాగ్యురాలనై ఏ కారణం చేతనో ఆయనను విడనాడి ఆయనను వెదకుచూ యీ అడవులలో పరిభ్రమించుచున్నాను. ఆయనను మీరెక్కడైనా చూస్తే ఆ జాడ నాకు చెప్పి పుణ్యం కట్టుకోనండి.” అనగా ఆ గుఱ్ఱపుదండు యాజమాని అయిన శుచి అనువాడు యిలా అన్నాడు. “అమ్మా! ఈ అడవిలో పెద్ద పెద్ద ఏనుగుల్నీ, సింహాల్నీ, ఎలుగుబంటిల్నీ చూస్తున్నామేకాని ఈ అరణ్యంలో మనుష్యులెవరూ కనబడరు” అనగా ఆమె మరలా ఇలా ప్రశ్నించింది. “అయ్యా! ఈ అశ్విక పటాలం ఎక్కడికి వెడుతూంది?” అని అడగ్గా “మేం చేది దేశ ప్రభువైన సుబాహువు యొక్క పట్టణానికి వెడుతున్నామమ్మా!” “నేను కూడా మీతో వస్తాను. ఎక్కడైనా నా పతి జాడ తెలుస్తుందేమోనని అంటూ ఆ బిడారు వెంట వెళ్ళింది. ప్రయాణించి ప్రయాణించి ఆ అశ్వదళం అలసిపోయి ఆ అడవిలో చల్లని నీరుతో నిండివున్న ఓ చక్కని తటాకం ఒడ్డున దాహం తీర్చుకోడానికీ విశ్రాంతి పొందడానికీ ఆగింది.

ఆనాటి అర్ధరాత్రి ఓ ఏనుగుల దండు ఒహాటి జలపానార్థం అటూ ఇటూ తిరుగుతూ పెనుమబ్బుల్లా అక్కడికి వచ్చాయి. అవి నిద్రపోతూన్న వారి కాళ్ళూ చేతులూ తొక్కి సంచరిస్తూంటే నిద్రనుంచి మేల్కొని కంగారు

పడుతూ ప్రాణభయంతో నలుమూలలకూ పరుగులు తీసే వారు కొందరైతే యింకొందరు చెట్లెక్కి కూర్చుండినారు. ఆ సంక్షోభంలో ఎట్లాగో దమయంతి ఏ ప్రమాదానికి గురి కాక బ్రతికిపోయింది. విధి విలాసం చాలా చిత్రమైంది. అసలు దురదృష్టవంతురాలు ఈమె అయితే చనిపోయినవా రితరులు. దైవం పూర్తిగా విచక్షణారహితమైనది.

ఈమె గజ సమూహాల దాడికి దూరమై ఉండగా ఆ ఏనుగులు బిడారులోని వారందర్నీ చంపిపారేసినాయి. అది వాళ్ళ పూర్వజన్మ పాపంకాక వేరేమగును?

ఆ ఏనుగుల గుంపులు స్వైర విహారం చేస్తూన్న ఆ సమయం నిశిరాత్రి. అటువంటి సమయంలో ఏ రక్షణా లేక ఏకాంతంలో ఉన్న కాంత అయింది.

అప్పుడామె గాలిలో కదలాడుతూన్న తీగె చిగుర్లా ఉన్న దమయంతి ఇలా ఆలోచించుకుంది ఆనాడు దేవతలు నాతో వివాహార్థం కోరికను తెల్పగా నేను నిరాకరించానన్న కోపంతో ఏనాటికైనా కసి తీర్చుకోవాలని అదృశ్యులయి వెంటాడుతూ మమ్మల్ని యిలా కష్టాలపాలు చేస్తున్నారా అనిపించుతోంది. స్వయంవరంలో పొందిన అవమానానికి దేవతలు తలపెట్టిన ప్రతీకార చర్య అనిపిస్తోంది. దేవతలే యిట్టి ఘాతుకానికి తలపడి నా భర్తకూ నాకూ కష్టాలను సృష్టించి ఎడబాటును కలిగించారని తోస్తోంది" అనుకుంటూ ఎక్కడో ఓ రక్షిత ప్రాంతాన్ని చూసుకుని నేలమీదే చేతిని తలగడా పెట్టుకు ముడిచిపెట్టుకుని నిద్రించింది.

తెల్లవారింది. బిడారులోనివారు చచ్చినవారు చావగా మిగిలినవాళ్ళు "అమ్మోయి! బాబోయి! అయ్యోయి!" అనుకుంటూ కుంటుకుంటూ ఎలాగో కష్టంమీద మిగిలిన ఆ కొందరూ ఆశ్వాలతో ఛేది దేశ రాజయిన సుబాహు పురానికి అలాగే నడుచుకుంటూ చేరారు. వారితోపాటు దమయంతి కూడా చేరింది. ఆ పట్టణ రాజవీధిగుండా కొంత డస్సినా ధూళి ధూసరితం అయి మబ్బుల్లో పరుగిడుతూన్న చందమామలా ఆజానుబాహ విగ్రహం కలిగి తళతళలాడు తూన్న బంగారపు మేనిరంగుతో అందాలు చిందుతూ జన సమూహంలోంచి తప్పించుకుంటూ మందగమనం రాజవీధి గుండానే సాగిస్తోంది. అటూ ఇటూ దిక్కులు చూస్తూ నలుని జాడను గుర్తుపట్టడానికి చక్రాల్లాంటి కన్నులని సారించు తోంది. ఆ సమయంలోనే ప్రసాదమందలి ఓ వేదికపై ఉండి నగర సౌందర్యాన్ని తిలకిస్తూన్న రాజమాత యీ దమ యంతిని గమనించి పరికించి ఆమె లక్షణాలను అర్థం చేసు కుని తనచెంత ఉన్న చెలికత్తెను పిల్చి అదిగో ఆ జన సమూ హంలో అందాల బొమ్మలా మెరుస్తూన్న సుందరాంగిని చూస్తూంటే నా మనస్సుకి ఎలాగో ఉంది. వెళ్ళి ఆమెను వెంటనే ఇక్కడికి తోడ్కొని రమ్మని పంపింది.

## రాజమాతతో దమయంతి

రాజమాత ఆజ్ఞ ప్రకారం ఒక దాది రాజవీధిలో దిక్కులు చూస్తూ తిరుగాడుతూన్న దమయంతిని చూసి రాజమాత కోరికను తెల్పి ఆమెను అంతఃపురంలోకి తీసుకు వెళ్ళింది.

ఆ దాదివెంట వెళుతూ దమయంతి మనస్సులో "ఆహా! విధివిలాసంలో ఇదో కొత్తమలుపు అనిపిస్తోంది. దీన్నిబట్టి చూస్తే అసలు ఆ దేవతలకి నే కష్టాలు పడాలన్నది లక్ష్యం కాకపోవచ్చు. నావంటి అందాలరాశిని పొందాడన్న కోపం నలుడిమీద కాగా తత్పరిణామం ఇలా మారింది అన్నమాట" అనుకుంటూ రాజమాతని దమయంతి దర్శించింది.

ఆ రాజమాత దమయంతిని ఇలా ప్రశ్నించింది. "ఓ సుందరీ! నిన్ను చూస్తే రాజవీధిలో నాకేదో అవ్యాజ కరుణ ముంచుకొచ్చింది. అందుకే నిన్ను పిలిపించాను. అయితే నువ్వు ఎవరవు. ఎవని భార్యవు? ఇలా దుఃఖపూరితురాలవై పరిభ్రమిస్తూన్న కారణం ఏమిటి? చెప్పు" అని అడిగింది.

"అమ్మా! రాజమాతా! నా భర్త శత్రు సమూహాలకి కంఠీరవం. మానవోత్తములకు శిరోభూషణం అయినవాడు. నా భర్త సకల సద్గుణ భరితుడైనా ఒక మాయ జూదంలో సర్వస్వాన్నీ ఆవేశపూరితుడై ఓడిపోయినాడు. అనంతరం ఆ కొత్త రాజు నన్నూ నా భర్తనూ దేశంనుంచి బహిష్కరించాడు. ఆ ఫలితంగా మేం అడవులకు వచ్చి చాలా కష్టాలు పడ్డాం. అలసి నేనొకచోట నిద్రించుతూండగా నా కష్టాలను చూడలేక ఒంటిబట్ట పీలికతో నలరాజు ఎచ్చటికో వెళ్ళిపోయాడు.

చేసేది లేక ఆయన జాడను వెతుక్కుంటూ పడరాని పాట్లు పడుతూ అడవులంపట పరిభ్రమిస్తూ సైరంధ్రీ దీక్షను పూని దొరుకుతూన్న కాయా కసరూ పండ్లు ఆకులూ తింటూ అలాగే నేలమీద శయనం పగలు పరిభ్రమించుతూ

ఇప్పటికి మీ దయకు పాత్రురాలనైనా అని మొహం అంతా దుమ్మూ ధూళీతో నిండివుండగా చీరకొంగు పీలికతో తుడుచుకుంటూ చెప్పడం ముగించి అలా కంట తడిపెట్టుకుని నిలిచి వుంది.

రాజమాత అంది దమయంతితో "ఓ మనోహరాకార! దిగులు పడకు. నువ్వు ఏ చింతా పొందక సుఖంగా ఉండు, ఇంతలో కొందరు బ్రాహ్మణులను నలుమూలలకూ పంపి నీ భర్తను వెదికించు ఏర్పాట్లు చేస్తా" అని రాజమాత అనగా దమయంతి ఇలా అంది.

"ఓ అమ్మగారూ! నేను ఈ మధ్య సైరంధ్రీ నోమును పూనినాను. ఎంగిలిని తినేదానను కాను. ఇతరుల పాదాలను కడిగేదానను కాను. పరాయి మగవారితో పలుకజాలను. కాని నా భర్తను వెదకుటకు పోవు బ్రాహ్మణులతో మాత్రం మాటలాడెదను. ఇవి నా నిష్ఠలు. వీటిని మీరంగీకరించిన మీ యొద్ద నుండగలదానను. ఇతర విధాలేవైనా అయినచో నేనుండలేనని మనవి అని మిన్నకున్నది.

ఆ మాటలు విన్న రాజమాత చాలా సంతసించి "నీ చిత్తం వచ్చినట్లు ఉండు. ఏ విధమైన గౌరవభంగం రానీయను. చూడు ఈమె నా కూతురు 'సునంద' అనునది, నీకు ఎల్లవేళలా సహాయురాలుగా ఉంటుంది. అని ఆమెకు కావలసిన ఏర్పాట్లు చేయించింది రాజమాత.

దమయంతి అంతటినుంచీ సైరంధ్రీ నామంతో అదే వ్రతాన్ని పూని శుభాభివృద్ధికరాలయిన నోములు ఆచరించుతూ తన భర్తని ఎల్లవేళలా దైవంగా తలచుకుంటూ నలుడి విరహానికి మాత్రం దుఃఖపడుతూ ఉంటోంది.

# నలుడు కర్కోటకుణ్ణి రక్షించుట

నలుడు దమయంతిని విడిచి అలా ఒంటి వస్త్రంతో చాలా దట్టంగా పెరుగుతూన్న అడవులలో ఎటుపోవాలో ఓ గమ్యం లేక పరిభ్రమిస్తున్నాడు. ఆ సమయంలో భయంకరంగా విస్ఫులింగాలు మంటలూ పొగలతో దావానలం విజృంభించడం చూసాడు నలుడు. అంతలోనే ఆ దావాగ్ని నుంచి "ఓ రాజా! రక్షించు, రక్షించు. ఇక్కడ నేను మంటల నుంచి వెలువడు మార్గం లేక చనిపోవడానికి సిద్ధంగా ఈ దావాగ్నిలో దగ్ధమైపోతూన్న సర్పకుమారుడను. చిన్న నాగును. త్వరగా వచ్చి కాపాడుము. నీ ఋణం తీర్చుకుందును. సాహసించి మంటలలోనికి దూకి ఇటు వచ్చి రక్షించు. ఇదే నిన్ను వేడుకుంటున్నాను" అను ఆర్త ధ్వనులు మంటలనుండి వినబడుతూన్న వైనం గమనించి తటాలున నలుడు సాహసంతో కారుచిచ్చులోకి దూకి ఆర్తరవం వినవస్తూన్న దిశగా పోయి అందులో చిక్కుకువున్న చిన్న నాగుపామును పట్టుకుని మంటలనుండి తాను బాధను అనుభవిస్తూ అయినాసరే బయటకు తెచ్చి కాపాడాడు.

అనంతరం ఆ నాగ కుమారుడు బాధనుండి విముక్తి పొందినవాడై తేరుకుని నలునివైపు దీనంగా చూస్తూ ఇలా అన్నాడు. "ఓ రాజా! నేను కర్కోటకం అను పామును. పాపకర్మ వలన ఒక బ్రహ్మర్షి యొక్క శాపానికి గురై కదల లేక అక్కడే పడిఉన్నాను. అంతలో అన్ని మూలలనుంచి ప్రళయాగ్నిలా కారుచిచ్చు విజృంభించసాగింది. చుట్టు చుట్టు

కుని బ్రాహ్మణ శాపం మూలంగా కదలలేక ఆ దావా నలంలో ఆ జ్వాలలకి బాధని అనుభవించుతూ మరణ సమ యానికి దగ్గరౌతూన్న సమయంలో నువ్వు రక్షించావు నన్ను.

"నా ఇంకొక కోరిక విను ఓ దయాశీలుడ! రాజా! నన్నిక్కడనుంచి అదిగో అల్లంత దూరంలో ఓ శీతల జల భరమైన తటాకం వుంది. మెల్లిగా నన్ను అచ్చటకు చేర్చు. నీకు మేలు చేస్తాను" అని అనగా నలుడు ఆ కర్కోటకాన్ని తీసుకుని వెళ్ళుచుండగా అది అంగుష్ఠమాత్రంగా శరీరాన్ని సంకుచితపరచుకుంది. నలుడు ఆ కర్కోటకాన్ని ఆ చెరువు వద్ద విడియునంతలో సర్పం "రాజా! ఇంకో పది అడుగులు వెళ్ళుము" అనగా నలుడు అట్లే చేయగా పదియవ అడుగు పెట్టునప్పుడు నాగము ఆతనిని కరచెను. దానివల్ల అతడు విష సహితుడయి వికృతాకారుడుగా మారిపోయాడు. పూర్వస్మృతులన్నీ మరిచిపోయాడు. అంతట కర్కోటకుడు నలుని చూసి ఇట్లు పలికెను. "ఓయి! గుణసార్వభౌమా! నల మహారాజ! బాధపడకు. భయపడకు. ప్రస్తుతం నా విష ప్రభావంవల్ల కురూపుడవైనా నీకిది ఉపకారమే సుమా. చూడగానే నువ్వు ఎవరవో ఎవరికీ తెలియదు. అందువలన ఈ చెడుకాలం పోయేవరకూ నీకిది కావలసినదే. నిన్నెవరూ ఆనవాలు పట్టలేరు. అందువలన నీకే ఆటంకం లేకుండా కాలం గడవగలదు. అంతేకాదు. నీ ఒంట్లో యీ నా విషం ఎంతకాలం ఉంటుందో అంతకాలం నీకు విష సర్పాలవల్ల కాని, రాక్షసులవలనగాని, పిశాచాల మూలంగాగాని,

శత్రువుల వల్లగాని ఏ విధమైన భయం ఉండదు. అన్ని రకాల సంకటములయందు ఓటమిలేని గెలుపును పొంద గలవు. ఇంకా ఏమంటే నీ ప్రియురాలి ప్రేమను రెట్టింపుగా పొందగలవాడవు. ఇలా కొంతకాలం గడిచిన తరవాత యథా విధంగా పూర్వవైభవాన్ని రాజ్య విభవాన్నీ పొందగలుగు తావు. నీకెప్పుడు నీ నిజరూపాన్ని పొందాలని అనిపించు తుందో ఆ వెంటనే నన్ను తలుచుకో అప్పుడు నీ పోయిన వస్త్రం నీ చెంతకు వస్తుంది దాన్ని ధరించు అంతట నీ సహజ సుందరరూపం నీకు రాగలదు." అని చెప్పి మళ్ళా యిలా అన్నాడు.

"ఈ లోకంలో యిక్ష్వాకు వంశంలో జనించి ఋతు పర్ణుడని ప్రసిద్ధి చెందిన రాజు ఉన్నాడు. అతడు సకల సద్గు ణాలతో ఒప్పుతూంటాడు. సమస్త వైభవాలూ కలవాడు. నువ్వు ఆ రాజుని సేవించు. ఆతని కొలువు నీకు అన్నివిధాలా తగియుండును.

"నువ్వు ఆ ప్రభువుకి 'అశ్వ హృదయం' అను విద్యను ఉపదేశించి అతని వద్దనుండి "అక్ష హృదయం" అను విద్య గ్రహించుము."

"ఆ రాజు కొలువునందు బాహుకుడను పేరుతో అతని కొలువులో రథసారథిగా వృత్తిని స్వీకరించుము." తనకు మేలు చేసిన కారణంగా నలుడికి కర్కోటకుడు యిన్ని విధాలుగా చెప్పవలసిన మాటలన్నీ చెప్పి మాయమైనాడు. కర్కోటకుని మాటల ప్రకారంగా నలుడు అయోధ్యా పట్ట ణానికి వెళ్ళి ఋతుపర్ణుడను రాజును చూసి "ఓ మహారాజా!

నేను బాహుకుడను వాడను. అశ్వశాస్త్రం యెరిగి ఆ ప్రకారంగా అశ్వశిక్షణను ఇవ్వగలవాడను. నాకు వంట చేయుటయందు మంచి నేర్పు కలదు. చాలా రకాలయిన చేతిపనులు బాగా తెలిసిన వాడను. కావున నీ యాస్థానమునందు సేవకునిగా నన్ను నియోగింపుము'' అని నలుడనగా వానితో ఋతుపర్ణుడిట్లు చెప్పాడు. "ఓయి! బాహుకా! నీకు అశ్వశిక్షణయందు నేర్పు కలిగినదికాన మా అశ్వాలను చక్కగా త్వరగా నడచునట్లు శిక్షణనిమ్ము'' అని ఋతుపర్ణుడు చెప్పగా అంతటినుండి బాహుకుడు ఋతుపర్ణుడి అశ్వశాలయందు ఉంటూ అతని ఇష్టప్రకారం చేస్తున్నాడు.

అక్కడ అశ్వవిచారణాధికారిగా ఉంటూ గుర్రాలను జాగ్రత్తగా పరీక్షించుతూ చెడ్డ గుర్రాలను ఏరి వాటిని మంచి శిక్షణనిస్తూ వాహ్యాళికి తగినవాటినిగా చేస్తున్నాడు. పెంకి గుర్రాలను దారిలో పెట్టాడు.

అంతేకాకుండా వంటా, వార్పూ చేయుటయందు మంచి నేర్పరితనం చూపి రాజు మెప్పును పొందుతున్నాడు. వార్ష్ణేయుడు జీవనుడూ అనువారలు బాహుకునికి సహాయులుగా ఉంటున్నారు.

ఈ విధంగా ఋతుపర్ణుడి కొలువులో ప్రచ్ఛన్న రూపుడై ఉంటూ ఒకానొక రాత్రి ఏకాంత సమయంలో తన భార్యను విడిచివచ్చిన ఘటనలను తలచుకోసాగాడు.

"అలనాడు ఓ చంద్రవదనా! దమయంతీ! నాతో బాటు చాలా కష్టాలు పడుతూండగా నే చూడలేక ఏం

చెయ్యాలో తెలియక ఏమీ తోచక అర్ధరాత్రి నీ చీర చింపు కొని ఆ పీలికనే మొలకి చుట్టుకుని నిన్ను విడువలేక విడవ లేక ఏకాంతంలో విడిచి ఆ చీకట్లో ఆ అడవి దారింబడి నడుచుకుంటూ వచ్చి పలుకష్టాలు పడి యిచ్చటికి చేరానే కాని నీ యోగక్షేమాలు ఏం తెలియక నేనెంతో బాధ చెందుతున్నా నేను లేకపోయినట్లయితే నువ్వు ఎలాగో విదర్భకు చేరి సుఖంగా ఉంటావన్న తలంపుతో అలా చేసా.

ఎక్కడ ఉన్నావో? ఎలా వుంటున్నావో? లేక ఏ వన్యమృగాలకైనా ఆహారం అయ్యావా? నీ జాడ ఎట్లయి నదీ ఏమీ తెలియకున్నది. నువ్వున్నావని విరహబాధ చెందనా వన్య మృగాలచే భక్షింపబడ్డావని విచారించనా. ఓ నా ప్రియపత్నీ నీ విరహంతో ఈ రోజులు ఎట్లా గడపను? ఇదంతా నా పూర్వజన్మ కృత పాపఫలం ఇప్పుడనుభ విస్తున్నా"నని నలుడు తన ప్రియపత్నిని తలుచుకుంటూ ఏవేవో ప్రలాపింపసాగాడు.

నలుడి ప్రక్కనే నిద్రించుతూన్న జీవలుండనేవాడు నలుడి వివశ ప్రలాపాలను విని ఆశ్చర్యపడుతూ అనుకు న్నాడు. "ఈ బాహుకుడు ప్రతిరాత్రీ ఎందుకో ఏదో దుఃఖ బాధను అనుభవిస్తున్నాడు. ఇతడి ప్రలాపాలను జాగ్రత్తగా ఆలోచించితే ఇతడికి ఒక భార్య ఉన్నట్లు అర్థం అవుతోంది. ఇతనికి ఆమెతో విరహం ప్రాప్తించినట్లు తోచుతోంది. ఇతడు చూస్తే నల్లగా మారిచేతులు కురూపి పొడల దేహం కలవాడుగా ఉన్నాడు. ఇట్టివాడికి భార్య బహుశా ఉంటుందా అని అనిపిస్తోంది. ఉన్నట్లయితే వీడికి తగినదే ఎవర్తో

అసహ్యమైన స్త్రీ ఒకత్తి ఉండునేమో? ఆలోచిస్తే దీనిని బట్టే వీని భార్య అందం తెలుస్తోంది. కొద్దిగా ఇతన్ని ప్రశ్నించి చూస్తే ఇతని సంగతి తెలుస్తుందికదా! మెల్లిగా ప్రశ్నించి ఇతని కథాకమామీషు అడిగి తెలుసుకుంటాను" అని బాహుకుణ్ణి సమీపించి "ఏమయ్యా! బాహుకా! నీ మాటలనిబట్టి చూస్తే నీకో భార్య ఉండేదనీ ఆమెతో నీకు విరహం సంభవించినట్లు తోస్తోంది. ఇదెంత నిజం అంటావు బాహూ!

వివశుడవైనప్పుడు కలలోనో మరెలాగో ప్రలాపాలను విని నాకు భార్య ఉన్నట్లు గమనించాడీ జీవలుడు. అసలు సంగతి చెప్పక ఎందుకు దాస్తున్నాడో జీవలుడు కనిపెట్టాలని అడిగి చూశాడతన్ని. నలుడతనికి ఇలా చెప్పాడు.

"ఓయి! జీవలుడా!" అని నలుడు తన వృత్తాంతాన్ని యించుక తన పరవశ వాక్యాల మూలంగా సూచనా ప్రాయంగా ఏదో పసికట్టాడు. కావున యుక్తి యుక్తంగా ఇప్పుడు వీనికి సమాధానం చెప్పుట మంచిది. నాకిక్కడ యీ కష్టకాలంలో ఇంత ఆధారం దొరికింది. ఇది పోగొట్టుకుంటినా ఇంకా ఎన్ని కష్టాలు పడవలసియుండునో. ఆ కర్కోటకుని మూలంగా నా అసలు రూపం పోయి యీ రూపం వచ్చింది. కనుక ఇతరులు నన్ను ఏ విధంగానూ ఎరుగజాలరు. ఇప్పుడు అనవసరంగా నన్ను నే బయటపెట్టుకొనుట వల్ల వచ్చునది కష్టంకాని వేరేమి కలదు" అని యోచించి "ఓయి! మిత్రమా! భార్య అనేది ఎవరు? ఎడబాటు ఏమిటి? ఇటువంటి హేయరూపంగల నన్ను ఎవతె చేపట్టును. నా

అందానికి నాకో భార్యకూడానా చాలు చాలు. ఇదిహాస్యాస్పదమైన సంగతికదా? అయితే నీకీ దుఃఖం ఎందుకువచ్చిందీ అని నువ్వు అనుకోవచ్చు. దానికి కారణం చెబుతా. ప్రజ్ఞా రహితుడు అనువాడు ఏం కారణంగానో తన భార్యను విడనాడి ఆమెను అన్వేషించి ఎక్కడా జాడ ఎరుకపడక విచారంతో పరవశించి ఆడిన పలుకుల మాదిరిగా నువ్వు విన్న విధంగా అతని మాటలు తలపుకు వచ్చి నిద్రరాని కారణంగా నువ్వు విన్న విధంగా ఆ పలుకులు నా నోట వెలువడ్డాయి. అయితే యీ ప్రలాపాలకీ నాకూ వేరేమి సంబంధం లేదు" అని వాడు విశ్వసించేలా మాటలాడి తననిజవృత్తాంతం పైకి రాకుండునట్లుగా నడుచుకొంటూ ఆ నలుడు బాహుకుడుగా చలామణీ అవుతూ ఋతుపర్ణుడి కొలువునందు ఆ అయోధ్యాపురంలో అలా కాలం వెళ్ళబుచ్చుతున్నాడు.

## నల దమయంతులను భీమరాజు వెదకించుట

నల దమయంతులు రాజ్యభ్రష్టులయి అడవుల పాలయిన సమాచారం విన్న విదర్భదేశాధిపతి బాధపడుతూ తన కుమార్తె, నలుడూ ఎచ్చట ఏం ఇక్కట్లపాలయి ఉన్నారో అని బహుభంగుల దుఃఖాక్రాంతి చిత్తుడై భూత భవిష్య ద్వర్తమాన సంగతులను తెలియగల పండితులైన బ్రాహ్మణులను కొందర్ని పిలిచి వారిని ఉచితరీతిని సత్కరించి వారితో మంచి మాటలతో ప్రసంగించుతూ "అయ్యా! బ్రాహ్మణ ప్రధానులారా! నా కూతురు నలుళ్ళ జాడ తెలియరాకున్నది. రాజ్యభ్రష్టులై ఎటకో వెళ్ళిపోయారని వింటున్నాను. వారిని

వెదకి వారి జాడ తెలుసుకుని రండి. అలా వారి జాడ తెలిపిన వారికి వెయ్యి బంగారు నాణాలనీ వెయ్యి ధేనువులనూ ఇంకా గొప్ప అగ్రహారాలనూ బహూకరించుదును. కష్టమైన పనిగా భావించక చాలా చాకచక్యంతో యీ పనిని నిర్వహించి వెతుక్కురండి" అని చెప్పి నలుమూలలకూ వారిని భీమరాజు వెదికింప పంపాడు.

బ్రాహ్మణులు కూడా ఆ విధంగా విదర్భరాజుని ఆజ్ఞను గైకొని చాలా దేశాలు వారి జాడలను అరయగోరి పల్లెల్నీ, జనపదాల్నీ, గ్రామాలనీ పట్టణాలనీ సంచరిస్తూ నలదమయంతుల జాడ కనుగొనుటకు గట్టి ప్రయత్నాలు చేయసాగారు.

## సునందుడు దమయంతిని గుర్తించుట

విదర్భ రాజైన భీమరాజు ఇష్టాన్ని నెరవేర్చుటకై నలదమయంతులను వెదకుచున్న బ్రాహ్మణులకు నల దమయంతుల జాడ యంతవరకూ వారికి తెలియరాదయ్యెను.

అలా సంచరించుచున్న బ్రాహ్మణులలో సుదేవుడను నామధేయుడయిన బ్రాహ్మణుడు చేది దేశానికి ప్రభువైన సుబాహువుయొక్క పురానికి వెళ్ళి పుణ్యాహవాచనార్థం రాజగృహానికి వెళ్ళుచున్న బ్రాహ్మణ బృందంలో కలిసిపోయి వారిననుసరించి రాజగృహంలోనికి ప్రవేశించాడు. అక్కడ అంతఃపురంలోనికి అటూ ఇటూ చూస్తూ సునంద అను రాకుమారికతో సంచరించుచున్న ఒక సుందరీమణిని సునందుడను బ్రాహ్మణుడు గుర్తించాడు.

"సైరంధ్రీ వ్రతంలో ఉండి చిక్కిపోయిన శరీరంతో తాళిబొట్టు తప్ప మరే ఆభరణాలూ లేక చక్కని ఆకారం రాణీ లాంఛనాలతో ఒప్పుచున్నది; చిగురుటాకులలో కప్పబడి గాలి తరగలకి అటూ ఇటూ కదలాడుతూ చక్కగా కనబడే ఓ సుమంలాగా నల్ల మబ్బుతునకలలోని మెరుపులాగా సానబట్టినా దుమ్ము కప్పిన రత్నంలా ప్రకాశం తరిగియున్న అమూల్యనిధిమణిని చూస్తూంటే ఆమె దమయంతి యొక్క వాలకం ప్రస్ఫుటంగా అగుపిస్తోంది. కనుబొమల మధ్య ఓ చిన్న అందపు మచ్చ ఉంది అది కూడా ఆమె దమయంతి అని ధృవంగా తెలియుచున్నది" అని ఆమెపోలికను సునందుడను బ్రాహ్మణుడు చిన్నతనం నుంచీ చూస్తూన్నదైనా నేటికి పెద్దదే అయినా కొంచెం అందం తగ్గి క్షీణచంద్రుడిలా ఉన్నా ఆమె దమయంతియే యను అభిప్రాయం బలంగా ఏర్పరచుకున్నాడు.

ఆ బ్రాహ్మణుడింకా ఆమెను గురించి వివరం పోల్చుకో సాగాడు "ఆమె వివాహితఅయి శుభలక్షణాలుకల పతివ్రతా చిహ్నాలు దాల్చి ఉంది. స్త్రీలకు పాతివ్రత్యాన్ని మించిన అలంకారం వేరేమీ లేదు పాతివ్రత్యానికి ఏ ధనం సాటిరాదు. పాతివ్రత్యం ఎంతో మహిమకలది అగ్నిలాంటిది. పుణ్యప్రదమైనది. గౌరవం కలిగించునది. పాతివ్రత్యాన్ని మించిన అందం వేరేమి కలదు? మానవ సంఘంలో సుస్థిరమైన స్థానాన్ని కలిగించేది, పది కాలాలపాటు మహాకీర్తి ప్రతిష్ఠలను సంపాదించేది యీ పాతివ్రత్యం!

ప్రతి సాధారణ స్త్రీ పతివ్రతా చిహ్నాలు తాల్చినా అటువంటి గాంభీర్యం ఉత్తమ ధర్మం భర్తనే నమ్మి పతిగా భావించగల మనస్తత్వం కలిగి ఉండడం సాధ్యపడదు. అల్ప స్త్రీలు ఎంత నటన చేసినా అల్పబుద్ధులే కలిగి ఉందురు గాని స్థిరచిత్తం దృఢ ప్రతిజ్ఞ "చాఢం" అనేలా ఉండవు. నేటి యీ దమయంతి ముఖం పుణ్యలక్షణ సంపన్నమై ఉన్నందున సందేహం లేదు. ఈమె విదర్భ రాజకుమారికయే."

ఆ బ్రాహ్మణుడు ఇంకా ఇలా అనుకున్నాడు. "ఆ విదర్భరాజు ఉప్పతిని ఆ రాజునే దిక్కుగా నమ్మి వారి వల్ల బ్రతుకుతూన్న మాకు మా మూలంగా ఆయన సంత సించితే ఆ దినమే కృతజ్ఞతా దినం—అదే సుదినం" అని యెంచి మెల్లగా వినయంగా మచ్చిక పరిచయం ఉన్నలాగ కొద్దిగా మాటలాడి చూస్తా.

## రాజమాత సైరంధ్రిని దమయంతిగా గుర్తించుట

సుదేవుడనే బ్రాహ్మణుడు దమయంతిని గుర్తించి ఆమెను సమీపించి ఇలా అన్నాడు.

"ఓ కమల దళాక్షి! విదర్భరాజపుత్రీ! నీ జననీ జనకులు విదర్భలో రాజగృహమందు క్షేమంగా ఉన్నారేకాని వారి మనస్సులు మాత్రం క్షేమంగా లేవు. మీ క్షేమ సమాచారాలు తెలియరానందున కలతచెంది ఉన్నాయి. మిగిలిన రాజాంతఃపుర పరివారం అంతా క్షేమమే. మీ క్షేమం తెలిసేవరకూ రాజగృహమందు ఏ వేడుకలూ వినోదాలూ విలాసాలు లేవు. వుండవు."

"అమ్మా నిషధరాజ పత్నీ! నేను నీ సోదరునికి మిత్రుడను. నేను సుదేవుడను బ్రాహ్మణుడను.

"నీ సమాచారం నీ భర్తను గురించిన జాడ తెలియక కుంగుచూ కొందరు బ్రాహ్మణులను దశదిశలకూ మీ జాడ తెలుసుకొనుటకై నీ తండ్రి విదర్భాధిపతియైన భీమరాజు పంపినాడు. మేమందరం సాధారణంగా చాలాచోట్ల వెదికాం. కాని ఏ విధంగానూ మీ జాడ తెలియతాలేదు. ఇది పని కాదని మేం నాలుగు దిశలకూ వెళ్ళి తీవ్రంగా అన్వేషింప బూని నేను చేది దేశానికి వచ్చి వెదకనారంభించాను. ఎట్టకేలకు నా పుణ్యవశం చేత నేడు చాలా మంచిరోజు. నిన్ను చూడగలిగా" అని బ్రాహ్మణుడు అనుచుండగా ఆ దమయంతి ఆ బ్రాహ్మణుణ్ని సుదేవుడుగా గుర్తుపట్టి తన తల్లి దండ్రుల బంధువుల క్షేమాన్ని విన్నంతనే కనుల నీరు కార్చసాగింది.

ఏడ్చుచున్న సైరంధ్రిని చూసి సునంద గబగబా వెళ్ళి రాజమాతకు సైరంధ్రి దుఃఖిస్తూన్న విధాన్ని చెప్పగా వెంటనే సఖురాండ్రందరితో రాజమాత ఆందోళన చెందుతూ చరచరా వచ్చింది దమయంతి ఉన్న చోటుకి.

ఆ సమయంలో సైరంధ్రితో సంభాషించుచున్న బ్రాహ్మణున్ని చూసి "ఓ బ్రాహ్మణోత్తమా! ఈమె మీకు తెలిసినదేనా! యీమె ఎవరు? నీవెవరవు? ఈమెను గురించిన సంగతులేమి? మాకు వివరంగా తెలపండి. మాకు విన వేడుకగా ఉంది. ఏ కారణంచేత ఈమె ఇలా పరిభ్రమించుతోంది? ఈ విషయాలు మాకు త్వరగా తెలియపరచండి.

ఈమె ఇక్కడ ఉండి పలురకాలుగా వ్రతాలు ఆచరిస్తూ నియమనిష్ఠలను పాటిస్తోంది. ఇదంతా ఏల సంభవించినది" అని అడగ్గా సుదేవుడిట్లా ఆమె సందేహాలకి సమాధానాలు చెప్పదొడగినాడు.

"ప్రకాశమానమైన ముఖమండలంగల ఓ రాజమాతా! ఈమెను గురించి ఏమని చెప్పుదును. నాకుగల వాచా విభవాన్ని బట్టి చెప్పడానికి ప్రయత్నిస్తా."

"ఈ సుందర కమలముఖి విదర్భరాజైన భీమరాజు కుమార్తె. నిజభూజ విక్రమార్జిత ధరాతల ప్రభువైన నిషధ రాజగు నలచక్రవర్తి సతీమణి. ఈమె దమయంతి అను పేర ప్రసిద్ధి చెందిన సుగుణరాశి.

విధివిలాసం వక్రించిన కారణంగానో, దుష్ట గ్రహాల ప్రవేశం వల్లనో నలమహారాజు దుష్ట వ్యసనానికి గురై హఠాత్తుగా సమస్త రాజ్యాన్నీ వైభవాన్నీ కోల్పోయి కట్టు బట్టలతో అడవుల పాలాయెను. ఈ పతివ్రతామతల్లి ఆ భర్తనే అనుసరించినది." అని విన్న విదర్భ ప్రభువు ఆ దంపతులను అన్వేషించడానికి బ్రాహ్మణులను దశ దిశ లకూ పంపాడు.

చేది దేశానికి వచ్చిన నేను బ్రాహ్మణ బృందంతో కలిసి ఇచ్చటకు వచ్చి పరికించి చూసాను అన్ని కోణాల నుంచి ఈ మండళప్రదురాలయిన దమయంతిని పుణ్య శుభ లక్షణాలుగల ఆమె ముఖాన్ని గమనించగా చిన్ననాడు చూసిన ఆమె ముఖంపై కనుబొమల మధ్యయందుగల శుభ

లక్షణాన్ని సంస్కారంలేక మలినమై ఉన్న ముఖ మండల మందు ఉండుటను గమనించా." అని చెబుతూన్న ఆ విప్ర వాక్యాలను వింటూన్న వారందరూ ఆశ్చర్యచకితులయ్యారు.

ఈ మాటలు వింటూన్న రాజమాత ఆనంద బాష్పాలు రాలుస్తూ మితిలేని సంతోషాన్ని పొందింది.

అంతేకాదు వెంటనే లేచి దమయంతిని చేరి సంతోషాతిశయంతో ఆమెను ఆలింగనం చేసుకుని ప్రేమగా ఇలా మాటలాడింది.

రాజమాత "ఓ చిన్నారీ! నేను! చూడు నాకేసి. ఎవర్ని? నీ తల్లిని. నేనూ మీ అమ్మా దశార్ణ మహారాజుకి కూతుళ్ళం. నీ తల్లి విదర్భదేశాధీశుడైన భీమరాజుని పరిణ మయింది. నేను వీరబాహునకు భార్యనయ్యాను" అని చెప్పింది.

వెంటనే దమయంతి వినయ విధేయతలతో ఆమెకి నమస్కరించింది.

నలమహారాజు భార్య అయిన దమయంతి సునందను తన ఒడిలో కూర్చుండబెట్టుకుని ఎంతో ప్రేమాలాపాలతో కొద్దిరోజులు గడిపింది. ఒకనాడు రాజమాతను చేరి ఇలా చెప్పింది. "అమ్మా! ఇక్కడ ఉన్నా విదర్భాపురంలో ఉన్నా ఒకలాగే వుంటుంది. ఎక్కడవున్నా ఒక్కటేకాని తమ్ముళ్ళనూ, తలిదండ్రులనూ నా పిల్లల్ని చూడాలని ఉత్సాహంగా వుంది. నువ్వు సరే అంటే వెళ్ళి వస్తానమ్మా! అందుకు తగిన యేర్పాట్లు కావించి నన్ను ఆశీర్వదించి

ప్రేమతో పంపుదూ అమ్మా!" అని వేడగా రాజమాత ఆమె కోరికకు అనుగుణంగా తన కుమారుని ఇచ్చి సైన్యంతో ఉచిత పరివారంతో మంచి సమయం చూసి రత్నాలతో ధగధగలాడుతున్న బంగారు రథంమీద కూర్చుండజేసి విదర్భకు పంపింది.

కొద్దిరోజులు ప్రయాణించి దమయంతి పరివారం తోనూ సైన్యంతో కుండిన నగరం చేరింది. అక్కడ భీమ రాజు దంపతులు కనుల ఆనంద బాష్పాలు పడుచుండ తన కూతురుని తీసుకుని రాజప్రసాదంలోకి ప్రవేశించారు. దమ యంతి ధూళి ధూసరిత ముఖం పతివ్రతా ధర్మం కలిగి చిక్కి ఉండి రాజ దంపతులకు నమస్కరించి అందరి క్షేమ సమా చారాలూ అడుగుతూ కూతుర్నీ కొడుకుని ఎత్తుకుని ముద్దు లాడి కొంతకాలం అలా ప్రాణనాథుని ఎడబాటుకి చింతిస్తూ కాలం గడుపుతోంది. కాని మనస్సు దిగులుగా ఉండి తన ప్రాణనాథుని ఉనికిని తెలుసుకుని ఎలా అయినా తన భర్త పాదసేవ చేయాలని ఆరాటపడజొచ్చింది.

ఒకనాడు తన తల్లిని సమీపించి ఏకాంతంగా ఉన్న సమయం చూసి మనోదుఃఖాన్ని దిగమింగుకుంటూ దమ యంతి అంది. "అమ్మా! భర్తకు దూరంగా ఉంటూన్న యీ జీవితం నాకు చాలా దుఃఖమయంగా ఉంది. నా ప్రాణ పతి లేకుండా నే బ్రతకలేనమ్మా! ఆయనను వెదకుటకు ప్రయ త్నింపజేయుము. కొద్ది కాలంలో ఆయన జాడ తెలిసినబా బ్రతికిపోగలను. లేదా ఇంక ఎంతో కాలం బ్రతుకజాలను. బ్రతకలేను. నాకు నా ప్రాణపతిని చూసే భాగ్యం కలిగించు.

లేదా కొద్దికాలంలో ప్రాణాలు పోవుట నిశ్చయమమ్మా! కాబట్టి త్వరగా వారిని వెదకే ప్రయత్నాలు ప్రారంభింప చెయ్యి" అని పతి విరహబాధతో చెప్పింది.

తల్లియు తన కూతురి అభిమతాన్ని తండ్రికి చెప్పింది. వెంటనే భీమరాజు తగిన తెలివిగల బ్రాహ్మణులను రావించి నలచక్రవర్తిని వెదకి ఆ వార్తను తమకు తెలియజేయమని అదికూడా అతి త్వరలో వెదకింపమని ఆ బ్రాహ్మణులకు తగిన ఏర్పాట్లు గావించాడా భీమరాజు.

వారు బయలుదేరేముందు దమయంతి వచ్చి ఇట్లు పలికింది. "ఓ బ్రాహ్మణులారా! నిషధాధిపతి అయిన నల మహారాజు పరిస్థితులకు లోనై విధివిలాసం బాగులేని కారణంగా అనర్హుడై అజ్ఞాతరూపంలో పోల్చుకోరానివాడుగా ఉండును. కావున ఆ నలుని గుర్తించుట కష్టతరంగా ఉండును. మీరలు ఆయనను గుర్తించే విధాన్ని మీకు చెప్తాను. వినండి. నా మాట ఫలించితే ఆయనను ఆనవాలు కట్టగలరు. అది యెట్లనగా మీరు రాజ నగరాలకు వెళ్ళండి. అక్కడ రాజాస్థానాలలో ప్రవేశించి యితరులకు మీరు చేయు ప్రయత్నాలు తెలియని విధంగా అనుమానం కలిగినచో యిలా చెప్పండి. అది యెట్లాగనగా సత్యమును పలుకువాడుగా ప్రసిద్ధి చెందినవాడు అయికూడా సహధర్మచారిణియు ప్రేమ కలది అగు భార్యను విడిచిపెట్టి, ఆమె ధరించిన చీరలో సగభాగాన్ని ధరించి నిద్రించువేళ ఆమెను విడిచి ఎక్కడికో వెళ్ళిపోవుట యుక్తమైనదేనా? అది ధర్మమగునా? భరించువాడు భర్త మరియు భరించబడునది భార్య అని పెద్దలు

అంటున్నారు కదా. ఆ శాస్త్రాన్ని అనుసరించక భార్యను విడిచియుండుట సుజన పద్ధతి కాదు. శాస్త్రాలలో భార్యా భర్తల సంబంధాన్ని గురించి చెప్పబడ్డ సూక్తులు నిరర్థకం పోతున్నాయి. అన్ని ధర్మాలూ అన్ని న్యాయాలూ లోక యాత్రయు తెలిసిన నువ్వు ఇలా ప్రవర్తించుట దయావిహీన బుద్ధి అనడానికి తార్కాణంగా వుంది. నిన్ను విడిచి నీ భార్య ఎట్లుండగలదు అని ప్రశ్నించుకున్నావా? ఆ సచ్చీలురాలు, ధర్మానికి కట్టుబడినది. నిన్నే దైవంగా నమ్మి పతివ్రతా ధర్మంతో చిక్కి శల్యమైపోయి ఉండుట నీకు సహ్యమగునా? అటువంటి అనువ్రతను తలచి దయ కలిగియుండుము అని చెప్తుంటే చివరికి అన్యాపదేశంగా ఉండలేక యించుక మాట్లాడినచో ఆతడే నలుడని గ్రహించండి. మీరు పలికిన మాటలకు ఆయన మాత్రమే సమాధానం చెప్పగలవాడు. ఇతరులు బదులు పలుకనేరరు. అట్టివాని మాటల అర్థం తెలుసుకుని నలుని నిర్ధారింప శక్యమగును. ఇందులకు బదులు చెప్పిన వానిని అర్థం చేసుకుని నన్ను గురించి అప్పుడు విన్న వించండి. అటుపిమ్మట ఆయనను ఇక్కడికి తీసుకురండి. అట్లు రానిచో ఆయన చేయు పని ఉన్నచోటును బాగుగా తెలుసు కుని రండి" అని చెప్పవలసిన మాటలన్నీ చెప్పి బ్రాహ్మణు లను పంపినది.

ఆ భూసురులున్నూ భీమరాజ దంపతులను చూచి వారి ఆజ్ఞ గైకొనిపోవుటకు వారియొద్దకు వెళ్ళిరి. భీమరాజ దంపతులు వారితో ఓ బ్రాహ్మణోత్తములారా! మీరు నా అల్లుని సమాచారం తెలిపినగాని తీసుకువచ్చిన వారికి

ధన కనక వస్తువాహనాదుల నొసంగువారము. మీరు యీ ధనాన్ని మీ ఖర్చులకు మీయొద్ద నుంచుకొనుడు. మీ రాకకై యెదురుచూచుచుందుము" అని చెప్పారా దంపతులు.

## దమయంతి నలుని వృత్తాంతాన్ని యెఱుగుట

వారి ఆజ్ఞ ప్రకారం తమ విధి నిర్వహణకై బయలు దేరిన బ్రాహ్మణులు నాలుగు మూలలకు వెళ్ళి అక్కడ వున్న రాజాస్థానములను పరికించి చూస్తున్నారు. అనుమానించిన వానిని దమయంతి చెప్పిన విధంగా మాట్లాడారు. కాని వారి మాటలకు బదులు చెప్పినవారే లేకపోయారు. కొందరు కొందరే పంపబడిన బ్రాహ్మణులు తిరిగి వచ్చి తమ తమ అనుభవాలను తెలియపరిచారు.

వారిలో పర్ణాదుడనే విప్రవర్యుడు దమయంతితో తన అనుభవాన్ని ఇలా వర్ణించిచెప్పాడు. "ఓ తల్లీ! ఋతుపర్ణుని యాస్థానమైన అయోధ్యా పురానికి వెళ్ళి మీరు చెప్పిన క్రమంబున ఆ నీ మాటలను ఒకనివద్ద చెప్పాను. అతడు పొట్టిగా ఉండి కురచ చేతులూ కాళ్ళూ కలిగి ఉంటున్నాడు. వంటా వార్పూ జరుపుటయందు మంచి నిపుణుడని పొగడ్త కెక్కినవాడు. రథ గమనమందు అశ్వములను పరీక్షించుట యందు నేర్పుగలవాడు. ఆ ఆస్థానంలో ఉంటూ నూరు నాణేలు వేతనంగా పొందుతున్నాడు. బాహుకుడను పేరు గల వికృతాకారుడునై ఉన్నాడు." అని చెప్పి ఇంకా ఇలా చెప్పాడు. "అమ్మా? మీరు చెప్పిన రీతిగా ఏ మాటలను ఉచ్ఛరించాను. నన్ను చూసి నా మాటలు విని ఏకాంతంగా

ఉన్న చోటుకి నన్ను పిలిచి వేడి నిట్టూర్పులు విడుస్తూ కొన్ని వాక్యాలు నాతో అన్నాడు. "ఓ బ్రాహ్మణోత్తమా! నువ్వన్న మాటలు విన్నాను. వాటి అర్థం నాకు అవగతం అయింది. నువ్వు ఆత్మగల సంబంధాన్ని గూర్చి అన్న మాటలు నిజంగా చాలా మంచివే. కాని వాటిలో కొంత రహస్యం ఇమిడి వుంది. ఆ సంగతిని నువ్వు గ్రహించినావు కావయ్యా! అదేమంటే ఏ హేతువుచేతనైనా భర్తయందు ఒక దోషం కనబడితే దానిని మనస్సులో ఏ స్త్రీ ఓర్పు చెంది వుంటుందో ఆ స్త్రీ ఉత్తమ పతివ్రత అనదగి వుంటోంది. భార్య అనగా అట్టిది. ఆమె ఉత్త పదానికి అర్హురాలు అగుచున్నది అటువంటి వనితకు యీ లోకంలోనూ ఉత్తర లోకమందూ ఉన్నత స్థానం పొందగలుగుతోంది. ఈ మాటలనే ఆర్యులు చెప్పున్నారు. ఈ మాటలు సత్యమైనవి. దండుగ మాటలు కావని నా ఆశయం అంటూ నన్ను విడిచి తన పనికి వెళ్ళిపోయెను" అని బ్రాహ్మణుడు దమయంతితో అని విరమించినాడు.

దమయంతి ఆదుర్దాతో పర్ణాదుడు చెప్పిన మాటలను సాంతం విని అంతఃపురంలోనికి వెళ్ళి ఏకాంతంగా కూర్చుని ఆ బ్రాహ్మణుడు చెప్పిన మాటలను తిరిగి తిరిగి గుర్తుకు తెచ్చుకుంటూ అందులో నలుని గురించిన ప్రసక్తి ఏమైనా ఉంటుందేమోనని బాగా ఆలోచింపసాగింది. పర్ణాదుడు చెప్పిన బాహుకుడనువాడు పర్ణాదుడి మాటలకు ప్రత్యుత్తరంగా కొన్ని మాటలు చెప్పాడుకదా. ఇతరులు నలుని జాడను గురించి యించుకంతకూడా చెప్పలేదు. ఆ బాహుకు

డనువాడు నలుడే కాకపోతే బ్రాహ్మణుడి మాటలకు కొంత స్పందించి ఉన్నాడుకదా? నలుడే కాకపోతే ఏం పలుకక మిగిలినవారిలాగ ఊరకుండేవాడే. ఈ మాటలు విన్న బాహుకుడు కలగజేసుకుని అంతమాత్రమైనా చెప్పాడంటే ఏదో కొంత సంబంధం ఉండి ఉండాలి. ఈ విషయంలో మరొక్క సారి బ్రాహ్మణుని పంపి ఆ బాహుకుడెవరో వివరాలు సేకరించుకు రమ్మని మరల ఇంకొక బ్రాహ్మణుని పంపి చూస్తానని వెనుకటి బ్రాహ్మణుడైన సుదేవుడను వానిని రప్పించి దమయంతి అ విప్రుడితో ఇలా అంది.

"ఓ బ్రాహ్మణోత్తమా! నీ చాకచక్యంతో మునుపు నన్ను కనిపెట్టి మా తల్లిదండ్రులను చేర్చి ఎంతో పుణ్యం కట్టుకొన్నావు. ఇప్పుడు నా భర్త అయిన నలమహారాజుని గురించిన వివరాలు నువ్వు ఋతుపర్ణుడి ఆస్థానానికి పోయి అక్కడ వంట వార్పు చేయు బాహుకుడను వానిని తెలుసుకుని అతడు నలుడై ఉండునేమో కనిపెట్టి ఆ విషయాలు నాకు తెలియపరచి విడిపోయి వున్న భార్యాభర్తలను ఏకం చేసిన పుణ్యం నీకింతా అంతా అని చెప్పలేను. మీకు ఎన్నో నమస్సుతాలు. మీకు సంతోషం కలిగేలా ఎన్నో కానుకలు అర్పించుదానను. నాయందు దయ ఉంచి ఋతుపర్ణుడి యొద్ద పనికాడైన బాహుకుని గురించిన పూర్తి సమాచారాన్ని సేకరించి నాకందీయగలందులకు మిమ్ము ప్రార్థించుతున్నాను. మీరు నేడే అయోధ్యకు పోయి ఋతుపర్ణుని వద్దకు చేరి యిట్లు చెప్పండి. అదియున్నా ఏదో ప్రస్తావన సందర్భంగా అంటూన్నట్లుగా అనండి."

"అది ఏమనో చెప్పమ్మా!" అని సుదేవుడడగ్గా దమయంతి మరల ఇట్లా చెప్పింది. "ఓ రాజా! విదర్భ దేశాధిపతి తన అల్లుడైన నలమహారాజు అన్ని విధాలుగా రాజపదవీచ్యుతుడై ఎటుపోయి ఎక్కడుంటున్నాడో ఏం తెలియరాకున్నది. అతని కోసం బ్రాహ్మణులను దేశ దేశాలకూ పంపి వెదికించాడు విదర్భరాజు. కాని ఏం సమాచారం రానందున అతనిపై ఆశ విడిచి ద్వితీయ స్వయంవరం జరపడానికి పూనుకున్నాడు. అందుకోసం చాలామంది రాజులు ఆ స్వయంవరానికి త్వరగతిని విదర్భ రాజధానికి హుటాహుటీ తరలి వెడుతున్నారు. అని చెప్పమని దమయంతి బ్రాహ్మణునికి చెప్పింది.

దమయంతినుండి సుదేవుడను బ్రాహ్మణుడు సెలవు తీసుకుని అయోధ్యకు వెళ్ళి ఋతుపర్ణుని సభలోనికి పోయి దమయంతి చెప్పిన రీతిగా సుదేవుడు ప్రకటించాడు.

"విదర్భరాజు తన కూతురైన దమయంతికి తన అల్లుడు జాడ తెలియనందున ద్వితీయ స్వయంవరం ప్రకటించి ఉన్నాడు. అదికూడా రేపే అని దానికి ముహూర్తం కూడా నిర్ణయింపబడింది. అప్పుడే రాజులందరూ హుటాహుటీని శీఘ్రంగా అచ్చటికి పోవుచున్నారు" అని ఏ కొద్దిభాగం కూడా విడవక దమయంతి చెప్పిన తీరుగా చెప్పి బ్రాహ్మణుడు విరమించాడు.

ఆ బ్రాహ్మణుడి మాటలు వింటూన్న ఋతుపర్ణుడు అశ్వశాలకు వచ్చి "బాహుకా! రేపు విదర్భకు పోవాలి.

తన అల్లుడు కానరానందున విదర్భరాజు దమయంతికి ద్వితీయ స్వయంవరం ప్రకటించాడట. దానిని చూడ్డానికి నేనుకూడా ముచ్చటపడుతున్నాను. బాహుకా! రథాన్ని నడిపే నీ ప్రతిభకి సమయం వచ్చింది. మంచి రథాన్ని గుర్రాలనీ సిద్ధం చెయ్యి. తెల్లవారితే లగ్నంఅటకూడాను. కనుక మనం యీ రాత్రికే అక్కడికి పోవాలి. ఇక్కడికీ విదర్భకీ ఒంద ఆమడల దూరం ఉంది. ఇంతదూరం మనం ఒక్క పగలులో అక్కడికి చేరిపోవాలి. నువ్వు అశ్వాలను నేర్పరితనంతో నడిపి నన్ను సాయంత్రం లోపులో అక్కడికి చేర్చాలి" అని చెప్పెను.

బాహుకుడు రాజుతో "మహారాజ! మీరు చెప్పిన విధంగా చేస్తా. ఈ విషయంలో మీరెంతమాత్రం సంశయ పడనక్కర్లేదు. నే నేర్చిన అశ్వవిద్యా చాతుర్యాన్ని ప్రదర్శించి మిమ్ము నేటి సాయంకాలం అగుసరికి విదర్భకు చేర్చే పూచీ నాది" అని చెప్పి బాహుకుడు తన పనిలో నిమగ్నుడయ్యాడు.

అనంతరం ప్రయాణం త్వరలో పడి ఇంకనూ అక్కడ వేచివున్న సుదేవుడను బ్రాహ్మణుని సత్కరించి కానుకలు ఇచ్చి వీడ్కొలిపి పంపించాడు ఋతుపర్ణుడు. ఇక తాను కూడా క్రొత్త క్రొత్త వేష భూషాదులు ధరించి విదర్భా ప్రయాణానికి సిద్ధం అయ్యాడు.

# విదర్భకు ఋతుపర్ణుని ప్రయాణం

నలుడు ఋతుపర్ణుని ఆజ్ఞాపన ననుసరించి గుర్రాలనూ రథాన్నీ సిద్ధం చెయ్యడానికి అశ్వశాలకు వచ్చి ఆ పనిలో నిమగ్నుడై ఇలా విచారింపసాగాడు. ద్వితీయ స్వయంవరం అను మాట వినగానే నలుడు మనస్సులో ఆశనిపాతం అంత బాధని అనుభవించాడు. ఆ దమయంతీ ద్వితీయ స్వయం వరం అన్న మాటలను తల్చుకుంటూ చింతాక్రాంత చిత్తంతో ఇలా తలపోస్తున్నాడు. "ఆనాడు అడవిలో ఏకాంతంగా విడిచి చెప్పకుండా వచ్చినందుకు నామీద కోపం వహించి తిరిగి స్వయంవరానికి సంసిద్ధతను తెలియజేసింది. ఇంత మాత్రం దప్పిదంకంటే వేరేమియున్నా కారణం కానరాదు. ఇది కనక సత్యం అయితే ఇక ఆడవాళ్ళని విశ్వసించడం తప్పే. స్త్రీలు చూపు కపట ప్రేమలను సత్యం అని తలచిన పురుషుడు నిజంగా బుద్ధితక్కువ్వాడని అనుకోవాలి. ఇందుకు దమయంతి పెద్ద ఉదాహరణం. దమయంతి ప్రేమ నామీద తిరుగులేనిదని నమ్మాను. కాని ఆ విశ్వాసంఅంతా వమ్మైంది. ఓ విపత్తు సంభవించినంత మాత్రంలో భర్త కనబడడం లేదా అందుచేత ఆ భర్తను విడిచి మళ్ళా వివాహం చేసుకో బూనినది. ఇలాంటి సందర్భాల విషయంలో స్త్రీలు యిలా ప్రవర్తించినట్లయిన ఆడవార్ని నమ్మడం ఎలా సంభవం? నేనీ విషయం ఇలా మలుపు తిరుగుతుందని తలచలేదు!"

"మాకు సంతానం కలిగింది. మా బంధం బలీయంగా దృఢపడిందని భావించా. భర్తను చేరి సంతానం పొందిన

స్త్రీ ఇలాంటి పనికి పూనుకుంటే ఇది చాలా గర్హనీయ మైంది. ఇదంతా అబద్ధం అనుకుందామంటే ఆ బ్రాహ్మణుడు బహిరంగంగా దమయంతికి స్వయంవరం అనీ రాజులందరూ అప్పుడే అక్కడికి చేరుకుంటున్నారనీ లగ్నం నిర్ణయం అయిం దనీ ఏల చెప్పవలసి యుండును? ఈ పరిస్థితినిబట్టి ఏం నిర్ణ యంచడానికీ వీలు పడడంలేదు. ఇడిగో ఋతుపర్ణుడు వెడు తున్నాడు గదా నేను కూడా అతనితో పోవుచున్నాను. అక్కడికి చేరినమీదట విషయం అంతా తెలుసుకుంటాను" అని నిశ్చయించుకుని మునుపు తన పిల్లలని వార్ష్ణేయుడు విదర్భాపురానికి తీసుకు వెళ్ళటానికి ఋతుపర్ణుని ఇంట్లో ఉంచిన తన రథాన్ని అక్కడికి తెచ్చి ఆ రథసారథికూడా ఆ ప్రభువుని ఆశ్రయించి ఉన్నాడు.

ఆ రథం చాలా మంచి రకానికి చెందినది. మంచి లక్షణాలు కలిగినది. ఇంకా ఆ రథం మహావేగంతో అంటే వాయువేగ మనోవేగాలను మించి వెళ్ళగల మాంచి గుర్రా లనుసిద్ధంచేసి ఋతుపర్ణుడికి తెలిపాడు నలుడు.

రథం సిద్ధం అయిందని తెలుసుకున్న ఋతుపర్ణుడు రత్నాంబరాలంకారాలు ధరించి వార్ష్ణేయుణ్ణి వెంటబెట్టుకుని రథాన్ని అధిష్టించాడు ఋతుపర్ణుడు.

రథాన్ని నడపడానికి నలుడు పూనుకోగానే ఋతు పర్ణుడు రథాసీనుడగుచుండగా గుర్రాలుయించుక కదలాడి నవి. దానిని చూస్తూన్న ఋతుపర్ణుడు "బాహుకా! ఇంత చిక్కిన అశ్వాలను రథానికి పూన్చావు కదా? ఇవి విదర్భ

దాకా పోగలవా? బలసిన గుర్రాలుండగా యీ బక్క గుర్రాలేల? వెళ్ళవలసిన దూరం నూరామడలున్నది. మన అశ్వశాలలో ఇంతకంటే బలసిన మాంచి గుర్రాలని తెచ్చి కట్టరాదూ?" అని ఋతుపర్ణుడు అనగా బాహుకుడు ఇంచుక నవి "మహారాజ! మన అశ్వశాలలోని గుర్రాలలో ఇవి అత్యుత్తమమైనవి. ఉచ్చైశ్రవస్సులా పరుగులు తీయగల మహావేగవంతమైన అశ్వాలివి. వీటిని మించిన గుర్రాలు అశ్వశాలలో లేవని నా ప్రార్థన.

"బాహుకా! మనం నాయంత్రం కాకుండా విదర్భకు పోవాలి. మన ప్రయాణం రసాభాస కాకూడదు సుమా" అన్నాడు ఋతుపర్ణుడు.

"మిమ్మ సాయం సమయానికి ముందే విదర్భకు తీసుకు పోగలవాడనని హామీ యిస్తున్నాను. నిశ్చింతగా రథంమీద యెక్కి కూర్చుండడి" అని నలుడు ధీమాగా చెప్పాడు.

"అలా చేర్చావా నువ్వు కోరినది నే నీకిచ్చి సంతోష పెట్టుదును. పోనిమ్మ" అని ఋతుపర్ణుడు రథంమీద కూర్చున్నాడు.

నలుడు ఒక్కసారి గుర్రాలని చిన్నగా "ఛల్" అని చరిచి కళ్ళాలు బిగించాడు. అంతే.

రథాశ్వాలు వేగంగా పోవడం మొదలుపెట్టాయి. వృక్షాలూ, కొండలూ కదిలిపోతూన్నట్లుగా వున్నాయి. ఆ రథం భూమ్మీద పరిగెడుతోందో ఆకాశమార్గాన పోతోందో ఏం తోచకుండా ఉంది.

ఋతుపర్ణుడు ఆ వేగానికి ఆశ్చర్యపడుతూ "సెభాస్! బాహుకా! వహావ్వా! అద్భుతం! నిరుపమానం! నా జీవితంలో రథాగమనం యిలాంటిది అనుభవించి యెరుగను. మొదట యీ గుర్రాలు బక్కచిక్కినట్లు కనబడితే తప్పుగా భావించాను. ఇటువంటి రథం, ఇలాంటి సారధి, ఇంతటి గుర్రాలు! లోకంలో సంభవించడం అరుదు. ఇది సూర్య రథంలాగా బాహుకుడు అనూరుడులాగా తోస్తున్నారు" అనుకుంటూ ఋతుపర్ణుడు రథగమన సౌఖ్యాన్ని అనుభవిస్తూన్నాడు.

ప్రక్కన కూర్చున్న వార్ష్ణేయుడు కూడా రథగమనమును చూచి ఆశ్చర్యపడిపోతున్నాడు. ఈ రథవేగం చూస్తే ఆశ్చర్యంగా ఉంది. ఈ బాహుకుడో సామాన్య రథసారథి అనుకున్నా. ఇంతటి రథగమన నైపుణ్యం ఇతనికి ఎలా అబ్బింది. ఇలా యీ బాహుకుడి శక్తిని అంచనా వేస్తే ఊహాతీతంగా తోస్తోంది యీతని శక్తి. రథాన్నీ సారథినీ అశ్వాలనూ గమనించి చూస్తూంటే అందునా ఇంతటి మహా వేగమా? దీన్నిబట్టి చూస్తే యీ బాహుకుడు అసాధారణ శక్తి సంపన్నుడని అనిపించుతోంది. ఇతని రథగమన ప్రజ్ఞా పాటవాన్ని అంచనా వేస్తూంటే ఇంద్రుడి రథసారథి అయిన మాతలి, శాలిహోత్రుడు, అనూరుడు మరియు నలమహారాజు లోకంలో రథాన్ని నడపడంలో అనన్య ప్రజ్ఞా దురంధరులని వింటున్నాం. బాగా ఆలోచిస్తే మాతలి కాడితడు. అల్లే శాలిహోత్రుడు, అనూరుడూ మాత్రం

కాదు. పోతే యీాయన ఇక నలమహారాజు అయివుండునా అని సందేహం కలుగుతోంది. అయితే నలమహారాజుయొక్క మేని వాలకం చాలా దర్శనీయమైనది. వీడేమిటి అసహ్యంగా వికారాకారంతో భయంకరంగా ఉన్నాడు. ప్రతిభావంతుల సామర్థ్యాన్ని అనుభవం వల్లనేకదా తెలుసుకోగలం. ఈ జగత్తులో మహానుభావులు దేవతల ప్రోత్సాహం కలిగి ప్రచ్ఛన్నంగానే ఉంటూంటారట. వార్ని గుర్తించుట చాలా కష్టం. కాని ఒక్కటి నిజం. ఇతడు దైవిదత్త ప్రతిభాశాలి అని మాత్రం నిర్ధారించక తప్పదు.

నలచోదితమైన రథం మహావేగంతో పోవుచున్న సమయంలో గాలివాలుకి ఋతుపర్ణుడు ధరించిన కండువా ఎగిరిపోయింది. దానికి ఋతుపర్ణుడు అదిరిపడి రథచోదకుణ్ణి చూసి "బాహుకా! నా కండువా రథవేగపు గాలివాలికి ఎగిరిపోయింది. ఒక్కసారి రథవేగాన్ని ఆపు. వార్ష్ణేయుణ్ని పంపి దాన్ని పట్టుకురమ్మందాం. ఆ తరువాత తిరిగి ప్రయాణం సాగిద్దాం" అన్నాడు.

ఆ మాటలు బాహుకుడు విని "రాజా! ఇప్పుడా కండువా ఆమడదూరానికి పోయింది. వార్ష్ణేయుడు వెళ్ళి దాన్ని తీసుకురాలేడు. అది సాధ్యపడదు. పోతే పోయిందని చింతమాని ఉండండి. నిమిషానికి ఆమడదూరం చొప్పున పరుగులు తీస్తున్నాయి గుర్రాలు మనం చాలా ఆలస్యం చేసి బయలుదేరాం. అస్తమయ కాలానికి ముందే మనం విదర్భకు చేరాలికదా! అంచేత గుర్రాల్ని ఇంత వేగంగా

తో తేస్తున్నాను. అని రథవేగాన్ని బహుభంగులుగా వివరించుతూ వెళ్ళిపోతూంటే రాష్ట్రాలూ, పల్లెలు, పట్నాలూ దాటుకుంటూ వెళ్ళిపోతూండగా ఋతుపర్ణుడు బాహుకుణ్ని చూసి దట్టంగా ఉన్న ఆ తాండ్ర చెట్టును చూడు. అని పిందెలతోటి ఆకులుతోటి ఉన్న ఆ చెట్టుని చూపి ఇలా అన్నాడు. "ఇదిగో బాహుకా! చూడు ఈ లోకంలో ఎందరో ప్రతిభావంతులు ఉన్నారు. అందరూ తలో విద్య లోనూ నిష్ణాతులుగా వుంటున్నారు. అన్ని విద్యలూ తెలిసినవాడు వుండడని నిశ్చయంగా చెప్పవచ్చు. ఋణ్ణంగా నేనో విద్యను నేర్చివున్నాను. అదేమిటంటే దేన్నైనా చూసి లెక్కించనక్కర్లేకుండా ఎన్ని స్వరూపాలున్నాయో చెప్పగలను. అది నాకున్న ఐచ్ఛిక విద్య. దాన్ని అక్షహృదయం అంటారు. దాని మహత్యం నీకు అవగతం చేస్తా. ఉదాహరణకు అదిగో ఆ యెదురుగా కనబడుతూన్న తాండ్రి చెట్టును చూడు. రథవేగానికి అది ప్రక్కకి వెళ్ళిపోతోంది. ఆ చెట్టు దగ్గరకు రాగానే ఒక్క త్రుటికాలం నిలుపు. దానికి యెన్ని ఆకులూ, ఎన్ని పిందెలూ ఎన్ని పళ్ళూ వున్నాయో వెంటనే చెప్పేస్తా. అప్పుడు నేను వట్టి రాజును మాత్రమే అనుకుంటావో ఒక మహా ప్రజ్ఞాశాలివనుకుంటావో చూడు" అని అంటూండగా ఆ తాండ్ర చెట్టు సమీపించగా నలుడు వేగం తగ్గించి ఆపాడు. ఋతుపర్ణుడా చెట్టును అంటే విభీతక పాదపాన్ని చూసి "బాహుకా! చూడు ఈ చెట్టుకి ఎన్ని పళ్ళూ పత్రాలూ మొత్తం ఎన్నున్నాయో చెప్తాను. దానికి రెండు పెద్ద శాఖలు వున్నాయికదా చూస్తున్నావా?

"బౌను చూస్తున్నాను. ఆ రెండు కొమ్మలకీ వున్న ఆకుల మొత్తం సంఖ్య పదివేలు ఒకటి. దానియందు వున్న పళ్ళు కూడా అన్నే. మిగతా చిన్న కొమ్మల్లో ఆకులూ పళ్ళూ కలిపి రెండువేల తొంభై. నే చెప్పిన యీ లెక్కకు తిరుగుండదు" అని రాజు అన్నాడు.

## విద్యల మార్పిడి

బాహుకుడు ఋతుపర్ణుడి విద్యా వైదుష్యానికి ఆశ్చర్యపడుతున్నాను. రాజా! ఇది ఇలా నిజం అయితే ఎంతో మెచ్చుకోతగ్గ విషయం. ఇది నమ్మాలంటే పూర్తిగా లెక్కించినకాని నమ్మలేను. మీరు అంగీకరించితే ఆ చెట్టును క్రిందికితోసి లెక్కించి వస్తానని అనగా అల్లే దాఖలా చూసి రమ్మని ఋతుపర్ణుడన్నంతలో బాహుకుడు గబగబా చెట్టును క్రిందికి పడదోసి లెక్కించగా ఋతుపర్ణుడు చెప్పిన లెక్కకు సరిపోయినది. అప్పుడు బాహుకుడన్నాడు ఋతుపర్ణుడితో "ఓ రాజా! ఈ నీ నేర్చిన విద్య చాలా అద్భుతమైనది. ఇలాంటి విద్య ఇంతవరకూ నేను కనలేదు. వినలేదు. నాకీ విద్యను నీనుండి నేర్చుకోవాలని వుంది. నా ప్రార్థనను అంగీకరించి నాకీ విద్యను ఉపదేశింపుము" అని నలుడు కోరాడు.

"బావుకా!" అన్నాడు ఋతుపర్ణుడు ఇంకా ఇలా చెప్పాడు. "ఇది అక్షహృదయం అన్నది. యీ విద్య చాలా గొప్పది. దీన్ని ఎరిగినవారు గణితశాస్త్రాన్ని దాని మర్మాలనూ యిట్టే తెలుసుకోగలుగుతారు. ఇంతేకాదు. దీని జ్ఞానం వల్ల ఆత్మశుద్ధియు పీడలన్నీ పోవుట, ఏ విధమైన

బాధలూ ఉండకపోవుట, మంచిగుణాలు అబ్బి కీర్తివంతులై మంచి మిత్రులు కలవారున్నూ కాగలుగుతారు. నువ్వు ఈ విద్యను అడిగావు కనక నీ యందలి ప్రేమచేత యీ అద్భుత విద్యను నీ కుపదేశింప నెంచాను" అని చెప్పి యథా క్రమంగా ఋతుపర్ణుడా విద్యను బాహుకునికి ఉపదే శించాడు.

విదర్భా పురానికి వెడుతూన్న ఉత్సాహంలో నిండు హృదయంతో ఋతుపర్ణుడు చెప్పగా నలుడా విద్యను స్వీక రించి పరమానందభరితుడయ్యాడు.

అటుతరువాత అయోధ్యా ప్రభువైన ఋతుపర్ణుణ్ని చూసి నిషధ దేశీయుడైన నలుడు అన్నాడు.

"గురు శుశ్రూషయా విద్యా పుష్కలేనధనేనచ అథవా విద్యయా విద్యా" (గురు శుశ్రూషచే విద్య పొందవచ్చును: తగినంత ధనం యిచ్చి విద్యను స్వీకరించ వచ్చు లేదా విద్య ఇచ్చి విద్యను గ్రహించవచ్చును) అను ఆర్యోక్తి ననుసరించి మీనుండి నేను అక్షహృదయం అను గణిత శాస్త్రాన్ని స్వీకరించాను. కావున దీనికి మారుగా నాకు తెలిసిన ఇప్పుడు మీరుకూడా చవిచూస్తూన్న అశ్వ హృదయం అను విద్యను మీకు చెప్తాను. మీరు దానిని స్వీకరింపవలయునని నా ప్రార్థన" అనగా ఋతుపర్ణుడు "చాలా సంతోషం. తప్పక స్వీకరించుతా. కాని ప్రస్తుతానికి ఈ విద్య తరువాత నేర్పుదువుగానిలే. మన ప్రయాణం ఆలస్యమయిపోతుంది కావున అవసరం పడగా నీ నుంచి

ఆ అశ్వహృదయం అను విద్యను స్వీకరిస్తా. త్వరగా పోనిమ్ము" అనగా విదర్భకు వేగంగా నలుడు ప్రయాణం సాగించాడు.

## నలునికి కలి బాధ తొలగుట

అదృష్టం రోజులు వస్తే అన్నీ అదృష్టాలే వరుసగా కలిసి వస్తాయి. ఋతుపర్ణుడు ఉపదేశించిన అక్షహృదయం ప్రభావంగా నలుణ్ని ఆక్రమించిన కలి అతనిలో వున్న కర్కోటక విషం బాధిస్తూంటే తట్టుకోలేక నిజస్వరూపంతో అతనినుండి బయటకువచ్చి నలుడి ముందు నమస్కారపూర్వకంగా నిల్చున్నాడు.

నలమహారాజు కలిని చూసి ఒక్కసారి కోపావేశాటోపంతో నేత్రాలనుంచి అగ్నికణాలు ఎగయుచుండగా ఎర్రవారిన చూపులు చూస్తూ శపించడానికి ఉద్యుక్తుడౌతూంటే ఆ భావాన్ని కనుగొని కలి చాలా భయంతో నే చేసిన తీవ్రమైన తప్పును క్షమించు నలసార్వభౌమా! ఉన్మాదం పెరిగిన కతన గర్వంతో నీలో ప్రవేశించి పలు కష్టాలు పెట్టాను. నీలో ప్రవేశించినది లగాయతూ నేనెంతో బాధల పాలయ్యాను. నాకు తిక్క కుదిరింది. బుద్ధొచ్చింది. అక్ష హృదయ విద్యాప్రభావం వల్లనూ కర్కోటక విషదందహ్యమానాంతరంగుడనై నీలో యింక వుండలేక బయటకు వచ్చిపడి నీ క్షమార్పణను కోరుకుంటున్నాను. ఇంకా ఏమంటే నీ పేరును ఉచ్చరించువారియందుకూడా ప్రవేశించను. ఏ విధంగానూ కలి బాధ కలుగకుండ చేయుదును.

నీ నామస్మరణ చేయువారి యెడ చాలా జాగ్రత్తగా వుంటాను. ఇదే ప్రమాణం చేసి చెబుతున్నాను. నన్ను క్షమించి విడువుము" అంటూ దీనభావంతో కోరగా నలుడా కలి మాటలు విని జాలిపడి "ఓయి! కలిపురుషా! క్షమా ర్పణ వేడుతున్నావు గాన నీ తప్పును క్షమించి విడిచిపెడు తున్నాను. మంచి చెడులు ఎరిగి ప్రవర్తించుకో" అని అతన్ని పొమ్మని చెప్పెను.

కలి పురుషుడు నలుడు చూపిన దయాగుణాన్ని మెచ్చు కుంటూ సంతోషంతో అతనినుండి సెలవు తీసుకొని తాండ్ర చెట్టులోనికి ప్రవేశించాడు. నాటినుంచీ కలికి నివాసస్థానంగా వున్న కారణంచేత తాండ్రచే తదోషదూషితమైపోయింది. దాని నీడను కూడా ఎవరూ క్షణం నిల్చుండరు.

నలునికీ కలికీ నడుమ జరిగిన యీ ఘటన వారిరు వురికేగాని వార్ష్ణేయుడికిగాని ఋతుపర్ణుడికిగాని యించుకంత కూడా తెలియదు. కర్కోటకుడి విషప్రభావంవల్ల యీ విషయం ఇతరులకు ఎరుకపడ లేదు.

నలసార్వభౌముడు యీ విధంగా కలి బాధను దప్పించు కుని సంతోషంతో తిరిగి రథారూఢుడై గుర్రాల కళ్ళేలను ఒక్కసారి కదలించి 'ఛల్' అన్నాడంతే. అవి పరుగులంకించు కున్నాయి.

అనుకున్న ప్రకారంగా సాయంకాలం కానంతలోనే విదర్భాపురం చేరారు.

ఆషాఢంలోని తొలి మేఘనాదాన్ని మించేలా ఉన్న రథనిస్వనం వినవస్తూండగా దమయంతి నియుక్తులయిన భటులు ఋతుపర్ణరాజు రాకను విదర్భాధీశుడైన భీమరాజుకి తెలియపరచగా భీమరాజున్నూ మంత్రి పురోహసేనాపతి సహితుడై ఋతుపర్ణుడికి స్వాగతం పలికి తీసుకువచ్చి మణి మయ సువర్ణ ప్రాసాదమందు ప్రవేశ పెట్టారు.

ఋతుపర్ణరాజు రాకను భీమరాజు దమయంతికి పంపెను.

దమయంతి ఋతుపర్ణుడి రథాన్ని నడుపుతున్నవాడు నలుడని ఆరథ ధ్వనినిబట్టి ఊహింపసాగింది. "నలుడు నడుపుతూన్న రథధ్వని ఇట్లే ఉండుననీ నలుడు అసమాన ప్రతిభా సంపన్నుడు రథం నడపడంలో అని దమయంతి తలపోయ సాగింది. నా భర్త రథాన్ని నడుపుతూంటే వచ్చే ధ్వని ఇలాగే వుంటుంది. ఆ ధ్వనిని నే ఆనవాలు పట్టగలను. నేనా ధ్వని సదా వింటూండేదాన్నికదా! ఋతుపర్ణుని దగ్గర బాహుక నామధారియై ఉన్నవాడు పర్ణాదుడి మాటలనుబట్టి నా ప్రియ పతి నలుడే అని అనిపిస్తోంది. అతడు నలుడై ఉండనిచో పర్ణాదుడి మాటలకు సమాధానం ఎందుకివ్వడం జరుగుతుంది? ఋతుపర్ణుడు నలుడి సారథ్యంలో ఈ స్వయం వరానికి వస్తాడనీ ఆశించిన రీతినే జరిగింది. ఇంత తక్కువ కాలంలో ఋతుపర్ణుడు రావాలంటే అది నలుని వలన మాత్రమే జరుగు పని. అతడు మాత్రమే అంత వేగంగా అశ్వాలను నడపగలవాడు. ఇది ఇతరులకు సాధ్యపడని విషయం. కనుక ఋతుపర్ణుడి యొద్దనున్న బాహుకుడు

నలుడే అని నిర్ధారించుట సమంజసంగా వుంది. అతనియందలి వ్యామోహం చేతనే నేనిట్లు స్వమతానుగుణంగా విషయాల్ని సమన్వయించుకుంటే చాలదు. ఆతడు నలుడే అయిన అది మంచిది. ఇతరుడెవడైనా అయితే ఏమగును నా పని? నా ఊహలూ నా ఆశలూ" అని చాలా విధాలుగా అసలు విషయాన్ని అన్ని కోణాలనుంచి విమర్శగా ఆలోచిస్తూ ఒక్కొక్కసారి నాథుడే అని సంతోషిస్తూ కాదేమో అని నిరాశ పొందుతూ ఏ నిర్ణయానికీ రాలేక ఋతుపర్ణుడితో వచ్చిన బాహుకుడు నా మనోనాయకుడయ్యేనా నా జీవితం ధన్యం. ఈ విషయం ఇదమిత్థంగా తెలుసుకున్న తర్వాత ఇక యీ దేహంలో ప్రాణాలు నిలవడం అసాధ్యం. భర్త లేని బ్రతుకుకు ప్రయోజనం ఏమి? బాహుకుణ్ని గురించిన విషయాలు పూర్తిగా తెలుసుకునేవరకూ నే ప్రయత్నింప వలసే వున్నది. అనంతరం నా అదృష్టం. నా భర్త అయ్యేనా శుభం. సంతోషం" అని ఒక నిర్ణయానికి వచ్చింది భీమ రాజు పుత్రి.

ఆ విధంగా దమయంతి ఆలోచిస్తూంటే భీమరాజు ఋతుపర్ణుడి కోసం ఏర్పాటు చేసిన విడిదిలో దిగి విశ్రాంతి పొందిన తర్వాత స్వయంవరానికి చేయవలసిన హడావిడి యేం కానరాదు. పురాన్ని అలంకరించలేదు. రాజులు ఎవరూ వచ్చినజాడ కానరాదు. స్వయంవర సన్నాహాలు ఏవంకా కనబడ్డం లేదు. పట్నంలోని ప్రజలు సంతోష విలాస వినోదాలతో కనబడుటలేదు. ఇదంతా చూస్తూంటే చాలా

చిత్రంగా ఉంది. మంగళవాద్యాలు తోరణాలు ఏవీ లేవు. ఈ పురంలో స్వయంవరాన్ని గురించిన భాషణమే వినరాకున్నది. ఇటువంటి స్వయంవర కార్యం జరుగుతోందంటే ఎంత హడావుడి, ఎంత పటాటోపం, జనుల కలకలం కోలాహలం ఏమీ లేవు. మామూలుగానే ఉంది కాని ఏ ప్రత్యేకత కానరావడంలేదు. రాజులు ఎవరూ వచ్చిన జాడలేదు. నేనే కనబడుతూన్నాను. దీన్నిబట్టి చూస్తే స్వయంవరం అన్నది కల్పనా కట్టుకథా? ఇది అబద్ధమే అయితే ఆ బ్రాహ్మణుడు ఎందులకు అట్లు చెప్పాను? అలా చెప్పవలసినంత అవసరం ఆ బ్రాహ్మణుని కేముంటుంది" అని తీవ్రంగా ఋతుపర్ణుడాలోచిస్తూంటే ఇందులో ఏదో నిగూఢ విషయం ఉన్నట్లు తోస్తోంది.

ఎవరూ రానిచోట ఏ స్వయంవరం లేనివేళ నేనిక్కడికి రావడం హాస్యాస్పదంగా ఉండునుకదా! ఇక స్వయంవర వనిత దమయంతి. ఆమె మహాపతివ్రతగా లోకప్రసిద్ధి చెందింది. ఆ సంగతి లోకవిదితమైనది. అలాంటి గొప్ప గుణాలుకల కాంతామణి పుణ్యాంగన ఏదో సాధారణ స్త్రీలా చటుక్కుని యతరుణ్ని అంత సులువుగా కాంక్షింప సిద్ధపడునా? ఇంకా న్యాయం చెప్పడంలో ప్రసిద్ధుడైన విదర్భరాజు తన కూతురు స్వయంవరానికి కోరిక తెల్పినా అందులకు భీమరాజు అంగీకరించేవాడేనా? అందులకు అంగీకరించేవాడేనా అని. ఎవరూ రాని యీ పనికి నే నొక్కణ్ణే వచ్చినందుకు నాకు ఇది చాలా లజ్జాస్పదంగా ఉంది అను

కుంటూ అసలు విషయం తెలియనందువలన తికమక పడు తున్నాడు ఋతుపర్ణ మహారాజు.

అదలా ఉండగా నలుడు రథాన్ని నిర్దేశించిన చోట ఆపి గుర్రాలను అశ్వశాలలో కట్టి తానొకచోట కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నాడు. అదే సమయంలో ఋతు పర్ణుడితో ఎవరెవరు కూడావచ్చారో కూడా రహస్యంగా దమ యంతి ఈ విషయంలో సత్యం తెలుసుకోడానికి ఎట్లా ప్రయత్నించడమా? ఉపేక్ష చేస్తే తన అభీష్టం నెరవేరేదెలా అని తలచి ఏదేనా ఓ ప్రణాళికని వేసుకుని ఆ ప్రకారం ఇందలి సత్యాన్ని తెలుసుకుంటా అని భావించి తనదగ్గరఉన్న చెలికత్తెలలో చాలా తెలివిగల చతురికను సమయాను కూలంగా విషయాన్ని కనిపెట్టగలదాన్ని చెంతకు రమ్మని కేశి అనుదానితో అంది. కేశీ నీ తెలివి నుపయోగించవలసిన తరుణం ఆసన్నమైంది."

"నా జీవిత సమస్యలో నువ్వు ఉపకరించవలసి వుంది. ఇది చాలా ప్రధాన విషయం. నువ్వు మంచి కౌశల్యంతో వాస్తవాన్ని కనిపెట్టవలసి వుంది. సఖియా! ఏదనగా ఆ పని, నేడు మన రాజధానీ నగరంలో ఋతుపర్ణ మహా రాజు అయోధ్యనుంచి వచ్చి ప్రస్తుతం యిక్కడ విడిదిచేసి వున్నాడు. ఆతనితో బాటు ఇంకా ఇద్దరు వచ్చారు. ఋతు పర్ణరాజును గురించి చెప్పూన్నది యేం లేదు. మిగతా వారి ద్దరిలో ఒకడు మన రథసారథిగా ఉన్న వార్ష్ణేయుడనువాడు. ఇతన్ని గురించి కూడా చెప్పవలసింది లేదు. కాగా పోగా

వారిలో మూడవవాడు. అతను బాహుక నామంతో ఉంటు న్నాడు."

"ప్రియ సఖీ! నా ప్రియ పతిని గురించి పర్ణాదుడు కొన్ని విషయాలు చెప్పాడు. ఆ లక్షణాలు బాహుకుని యందు ఉన్నవా? బాహుకుడు నలుడేనా? అని నిర్ధారించ వలసివుంది. నేను పర్ణాదుడను బ్రాహ్మణుడు చెప్పిన విష యాలను బట్టి వేషభాషా రూపములు ఆకారంలోనూ కాల వశంచేత కొద్దిపాటి మార్పు కనబడినా మొత్తంమీద నా ప్రియపతి జాడలు ఉన్నట్లు నాకు తోచుతోంది. నువ్వు అతని చెంతకు వెళ్ళి ఆతనితో యుక్తియుక్తంగా మాట్లాడి అసలు సంగతి గమనించి నా హృదయంలోని బెంగను దూరం చెయ్యి. నువ్వు ఆయన వద్దకు వెళ్ళి నిజమైన విష యాలను సేకరించి తిరిగి త్వరగా వచ్చే నీ రాకను ఎదురు చూస్తూందును ఇక్కడే ఉంటాను" అని చెప్పి ఆమెను అతని వద్దకు పంపింది దమయంతి.

## నలుడు అంతఃపుర విషయాలను తెలుసుకొనుట

ఆలోచించుతూ కేశి అను దమయంతి చెలికత్తె బాహుకుడున్న ప్రాసాద ప్రాంతానికి వెళ్ళి బాహుకుడితో ఇలా సంభాషించింది. "ఆర్యా! భీమరాజు కుమార్తె మీరు వచ్చినట్లు తెలుసుకొని మిమ్మును గురించిన వృత్తాంతాన్ని తెలుసుకొనుటకు నన్ను ఇచ్చటకు పంపింది. మీరు ఇక్కడికి ఎక్కడినుండి వచ్చారు? ఈ నగరానికి వచ్చిన కారణం యేమి? ఇక్కడ ఎవరితోనైనా పనివున్న కారణంగా వచ్చారా?

నాయందు కృపాదృష్టి కలిగి చెప్పవలసిందిగా మిమ్మ్ని కోరుతున్నా" అనగా విని నలుడు శిరస్సు కదిలించి మాటలన్నీ విని ఆ మీదట ఇలా అన్నాడు.

"ఓ అంతఃపుర కాంతామణీ!" అని పిలిచి బాహుకుడు ఇలా అన్నాడు. నీ చెప్పిన అడిగినదాన్ని బట్టి చూస్తే నువ్వు భీమరాజు కుమార్తెకు సఖురాలవనిపిస్తోంది. భీమనందన నన్ను గురించి క్షేమసమాచారాలు తెలుసుకురమ్మన్నది అంటే అది నాకు చాలా ముదావహంగా వుంది. నువ్వు దమయంతికి దాసివని అంటూ ఎక్కడనుంచి వచ్చారు? ఎందుకు వచ్చారు? ఏం పనిమీద వచ్చారు అంటూ ఏం తెలియనట్లుగా ప్రశ్నిస్తున్నావు. ఇది నాకు చాలా వింతగా ఉంది. ఇలా మాట్లాడుతున్నావంటే చాలా తెలివి ఉపయోగించుతూన్నట్లు కనబడుతోంది. నీ ప్రశ్నలనుబట్టి నన్ను గురించి నీకు కొంత విషయం తెలుసునని అర్థం అవుతోంది. అటువంటప్పుడు నీ ప్రశ్నలకు సమాధానం చెప్పడం ఎలా? ఐనా కాని రాజకుమారి అయిన దమయంతి దగ్గిర్నుంచి వచ్చానంటున్నావు. కనక చెప్పవలసిన బాధ్యత నాకుంది. బదులు చెప్పడం సరిగా లేకపోతే ఆమెను కించపరచినట్లు అవుతుంది. అమర్యాద చేసినట్లు అవుతుంది. అంచేత చెప్తా విను.

విదర్భరాజ తనయ అయిన దమయంతి భర్త రాజ్య భ్రష్టుడై సమస్త సంపదలనూ కోల్పోయి అడవుల పాలయి కష్టాలనుభవిస్తూ నలుగురిలో తలయెత్తి సంచరించటానికి బిడియపడుతూ, ఆ రాకుమారిని వదలిపెట్టి ఎటోపోయాడు.

ఆమె జనకుడా సమాచారాన్ని విని తన కూతుర్ని తన యింటికి తీసుకువచ్చాడు. అనంతరం ఆమె భర్త నలుడి కోసం అన్ని దేశాలు వెదికించాడట. అతని జాడ తెలియ రాలేదు. అంచేత విదర్భరాజు హతాశుడై అనంతర కర్తవ్యం అర్థంకాక బుద్ధిమంతులతో యోచించి తన కుమార్తెకు ద్వితీయ స్వయంవరం చెయ్యటానికి నిశ్చయించి వార్తలను పంపాడటకదా? ఇప్పుడు ఋతుపర్ణ మహారాజు దమయంతి యొక్క ద్వితీయ స్వయంవరాన్ని చూడ్డానికి ఉత్సాహపడి అయోధ్య నుంచి ఒందామడలదూరం ప్రయాణించి విదర్భకు సాయంకాలం అతని క్రితమే చేరాలంటే హుటాహుటిన గుర్రాలని వేగంగా నడిపి ఆలస్యం లేకుండా తీసుకువచ్చాను. ఇప్పుడు తెలిసిందా నేనెవర్నో? నేనారాజు రథసారథిని. అంత తొందరపడి శ్రమతో రావడం ఎందుకంటే రాజునకు సమాచారం ఈ ప్రొద్దున్నే తెలిసింది. బ్రాహ్మణుడు రేపే మంచి ముహూర్తం ఉందని చెప్పాడు. ఆ కారణంగా అతి శీఘ్రంగా రావడం జరిగింది. అదికూడా నేను రథాన్ని నడిపాను కనక త్వరగా రావడం సాధ్యపడింది.ఇతరు డెవడైనా యీ పనికి పూనుకుంటే అనుకున్న, సమయానికి రావడం అసాధ్యం అయ్యేది. ఇది మా రాకను గురించిన సంగతి" అని బాహుకుడు దమయంతి చెలికత్తెఅయిన కేశికి చెప్పాడు.

కేశిని అను దమయంతి సఖురాలు అంతటితో నలుణ్ని విడువక ఇంకా ఏమో ప్రశ్నలు అడగవల్సి కొంచెంసేపు తటపటాయించి ఇటూ అటూ చూస్తూ "రాజా! నీతో బాటు యింకో వ్యక్తి కూడా వచ్చాడు. అతనెవరూ? అతను యేల వచ్చాడూ?" అని మళ్ళా కేశి అడిగింది నలుణ్ని.

అతను బదులు చెప్పాడు. "అతను వార్ష్ణేయుడని నలుడి రథసారధిగా ఉండేవాడు." అనంతరం సఖురాలు అడిగింది. "అతను మీతో ఎందుకు వచ్చాడు? ఆ రాజువద్ద అతడెట్లా చేరాడు?" అని ఇంకా ప్రశ్నించింది. నలుడిలా బదులు చెప్పాడు. "వాణ్ని గురించా అడుగుతున్నావు? వాడు వార్ష్ణేయుడు. నలుడి పిల్లల్ని విదర్భరాజు వద్ద దిగవిడిచి వెళ్ళడానికి వార్ని రథంమీద తీసుకువచ్చి ఇక్కడ విడిచి వెళ్తూండగా దారిలో నిషధరాజు రాజ్యభ్రష్టుడై భార్యతో రాజ్యాన్ని విడిచి ఎక్కడికో వెళ్ళిపోయాడని విని వాడు తిరిగి నిషధ రాజధానికి వెళ్ళడానికిఇష్టపడక ఆ రథాన్ని తీసుకుని తిన్నగా అయోధ్యా పురానికి వెళ్ళి ఋతుపర్ణుడి ఆస్థానంలో చేరి అక్కడ ఉంటున్నాడు. మేం ఇక్కడికి వచ్చే వేళ వాణ్నికూడా కూడాతీసుకువచ్చారు. అదీ సంగతి" అని చెప్పాడు.

"అయితే పాపం!" అంది దమయంతి సఖురాలు, ఇంకా అలా అంది. భార్య కూడి నిషధ దేశాధీశుడు దేశాన్ని విడిచి వెళ్ళడమా? ఎంత కష్టం. అటువంటి చేటు పరిస్థితి పొందవలసినవాడు కాదు. అదంతా దైవలీల. అది అలా జరగవలసి వున్నది. జరిగింది. ఎవ్వరూ ఏం చెయ్యలేరు. అయితే నలుడు వెళ్ళిన దిక్కు వార్ష్ణేయుడికైనా తెలుసును కాబోలు. నాకలా అనిపిస్తోంది. మరి మీరేమందురు?" అని అడగ్గా బాహుకుడు "ఊఁ? అతని కథా కమామీషు అతనికి తెలియకపోవచ్చు. దారిలోనే నలుని

వృత్తాంతం తెలిసి అయోధ్యకు పోయాడన్నావు కదా! వాడికేం తెలుసును? కాని నలుడికి దమయంతికీ మాత్రమే వారు వెళ్ళిన జాడ తెలియాలి. ఇతరులకి ఎలా తెలుస్తుంది?" అన్నాడు.

ఆ తరవాత కేశి మనస్సులో ఏదో ఆలోచిస్తూన్నట్లు అభినయించి నేత్రాలు నిండేలా అశ్రువులు రాగా "పాపం! హతవిధి ఎంత చేసాడు? దమయంతికి రావలసిన పాట్లు అట్టివి కాకూడదు. ఓర్చుకోలేని అమాయకురాలు. ఆమె సంగతి వింటే దుఃఖం కట్టలు తెంచుకు వస్తుందెవరికైనా? పోనీ ఆ వార్ష్ణేయుడికి నలమహారాజు వెళ్ళిన తోవ ఎట్లైనా తెలిసి వుంటుందేమో?" అని తన అనుమానాన్ని తెలియ జేసింది.

దానిమీద బాహుకుడు "అబ్బే! అటువంటిది వానికేం తెలియదు. ఆ రాజుని గురించి వాడు ఏం ఎరుగడు." అనగా దమయంతి చెలికత్తె ఇలా చెప్పింది. "తెలుస్తూన్న సంగతి ఏమంటే అరణ్యంలో దమయంతి నిదురలో ఉండగా ఆమె ధరించిన వస్త్రాన్ని చింపుకొని దాన్ని ధరించి ధర్మ ప్రవృత్తితో నిర్భయంగా ఘాతుక మృగాల మధ్య వదిలి ఎటో పోయి ఉండునని కదా. నిద్రనుంచి మేలుకొన్నా ఆ రాణి తన ప్రాణపతిని ఎటూ చూడక దుఃఖంతో ఆయనకై కేకలు వేస్తూ నాలుగు మూలలా గవేషింపజొచ్చింది. ఆ అడవు లంపట పడరాని కష్టాలు పడిపడి చివరికి ఎలాగో ఇక్కడికి చేరింది. ఇక్కడ ఆమెకు అన్నిసుఖాలూ సిద్ధంగా ఉన్నాయి. అయితేనేం? ఆమెకి ఆ సుఖాలమీాద యిచ్ఛ లేకున్నది.

ఏ సుఖాన్నీ కోరదు. తన భర్త చింపగా మిగిలిన ఆ వస్త్రాన్నే ఇంకా ధరించి వుంటోంది. ఎంత గొప్ప వస్త్రాలు చూపినా పూతిక పుల్లను తోసిపారేసిన విధంగా దూరంగా తోసే స్తోందే కాని యించుకంత చూపుకూడా సారించదు వాటి మీాదికి. స్నానాది పరిశుభ్రతలను కొంచెంకూడా పాటిం చదు. శరీరం అంతా తైలాభ్యంగనాది సంస్కారాలు లేని కారణంగా వివర్ణమైనట్లు దుమ్ముతో నిండి చింపిరిగా ఉంటుందే కాని ఎట్టి చిన్న వినోదాన్నీ తలంపదు. అనుభవించడానికి ఇష్టపడదు.

తనతోటి వారలు నవ్వుతూ ఆటపాటలతో సరదా లతో ఉత్సాహంగా వున్నా ఆమె మాత్రం ఆ విచార విగ్రహం మూర్తీభవించిన దుఃఖంలో ఉండునేగాని ఈ లోకంలో ఉన్న తీరు ఆమెలో కానరాదు. ఏవో తలంపులు, ఏవో కళవళింపులు, ఏదో పరధ్యానం. దేహాన్ని గురించిన చింత ఆవంతకూడ పట్టించుకోదు. నల్లగా సుందరంగా ఉండ వలసిన కేశపాశం దుమ్ము ధూళితో నిండి చెప్పాలంటే అసాయంగా ఎగురుతూండును. మైపూతలతోనూ సువా సనలతో చెలగవలసినది కనీసంగా శ్రద్ధ వహించదు. ఈ లోకానికి సంబంధించిన ఊహలే కానరావు. ఏవేవో పరాకు మాటలు అర్థరహితం ఆడుచుండును. ఏకాంతవాసమునే ఇష్టపడును. నృత్య వాద్య గోష్ఠులయందు కాని కథా శ్రవణా దులయందు కాని ఇష్టం చూపదు. ఏ కొదవాలేని రాజాంతః పురంలో ఉండికూడా అరణ్యవాసం చేస్తూన్న తీరే తోచును.

కాని నాగరికత సంస్కారం అన్న వాటిని కనీసంగా కూడా పాటింపదు. వెయ్యివిధాలుగా ఆమె లోకం ఏమో మాకు అర్థంకాదు. ఆమెకు మనస్సు లేదు; మానం లేదు, భావం లేదు; భజన లేదు, భక్తి లేదు, లేదు లేదు ఏం లేదు.

"మా బాధ పడలేక కోరగా కోరగా కొద్దిమాత్రం జీవనయాత్రకు తగినంతగా ఆహారం కష్టంమీద భుజించు తుంది. నలుని గురించిన మాట, నలుని గురించిన తలంపు నలుడు నలుడూ నలుడూ...అంతే వేరేమీ లేదు.

ఏనాడో ఎక్కడో సైరంధ్రీ వ్రతం పూనింది. అదే స్వగృహంలో కూడా. రాను రానూ బలహీనమైపోతోంది. కృశాంగి అయిపోతోంది.

ఏ భోగాల జోలికీ పోదు. కేవలం భగవంతుని తన పతిని కూర్చుమన్న మాటలనే ఉచ్చరించుతూంటుంది. జరా భారంతో కృంగిపోయిన దానిలా బాధాకర దృశ్యంగా ఉంటోంది" అని చెప్పి కేశిని గద్గద కంఠంతో కనుల నీరు నిండింది.

కేశిని మాటలు వింటూన్న నలుడు విచార పూరిత దయా భరిత వాక్యాలకు జాలిపడిపోయి ఒకోసారి కన్నుల నీరు కనబడింది. ఇటువంటి విషయాలు వింటూంటే అసందర్భంగా దుఃఖించుతూన్న వాతావరణం కనబడితే ఆ దాసి ఏం భావించునో అని కన్నులలోని నీరు అలాగే హరించి పోయేలా చేస్తూన్న బేలతనాన్ని కప్పిపెట్టుకుంటూ తల ప్రక్కలకు త్రిప్పుతూ ధీరోదాత్తగుణాన్ని కనబరచాడు.

కేశిని పరాభిప్రాజ్ఞానమందు చతురురాలు కావడంచేత నలుని ఆంగిక చేష్టలని శ్రద్ధగా పరీక్షించుతూంది. తాను తన ప్రియరాణి దయాదీన సత్యస్థితిని ఏకరువు పెడుతూంటే ఒక మూల నలునిలో కలిగే మార్పులను చక్కగా అర్థం చేసుకొంటుంది. ఒక్కొక్కసారి తన మాటలను వింటూ పరధ్యానంలో పడిపోవడం, దీనంగా ఉండడం నిశ్వాసాలు వేడిగా విడుస్తూండడంలాంటి లక్షణాలని గమనించి కేశిని ఇలా అంది. "ఓయీ! బాహుకా! నాకు హజారంలో చాలా పని ఉంది. ప్రస్తుతానికి సెలవు తీసుకుని వెడుతున్నా. అవసరం అయితే మళ్ళీ వచ్చి కనబడుతా" అని అతనికి వీడ్కోలు చెప్పి దమయంతి ఉన్న అంతఃపురంలోకి వెళ్ళి దమయంతి వద్దకు వెళ్ళి తాను నలుణ్ని చూసినది లగాయతూ విడిచి నంతవరకూ తనకూ అతనికి మధ్య జరిగిన అన్ని విషయాలనీ కూలంకషంగా చర్చించిన సంగతులు అన్నింటినీ పూర్తిగా చెప్పింది కేశిని. ఇంకా బాహుకుడి గుర్తులనూ అతని మాటల్నీ ఉన్నవి ఉన్నట్లు చెప్పింది.

## నలుని మహిమ

దాసి అయిన కేశిని అక్కడ తాను గాంచిన విన్న విషయాలను యథాతథంగా దమయంతికి చెప్పింది. కేశిని చెప్పిన విషయాలను బాగా తర్కించుకుంది దమయంతి. పరిపరి విధాలుగా ఆలోచించితే బాహుకుడు నిషధనాథుడనియే నిర్ణయింప వీలు కలుగుతోంది.

దమయంతి తన మనస్సులో అతడు నిషధరాజు కానిచో నా కష్ట ప్రసంగాలలో ఆయన దుఃఖం కలుగుట యేల సంభవించును? దీనంగా ప్రవర్తించుట, పెడమొగం పెట్టుటవంటివి ఏల సంభవించును? సంబంధం ఉన్నందువల్లనేకదా యిట్టి గుణాలు కలుగుచున్నాయి. అయితే నిషధరాజు రూపం వేరు. ఇంచుక మార్పు కలిగివుంది బాహుకుడి రూపం. పోతే ఇతర విషయాలు అన్నీ బాహుకుడే నలుడని నిర్ణయింపదగియున్నది. ఇదమిత్థంగా నిర్ధారణ చేయడం తగదు. ఈ విషయంలో మరికొంత దర్యాప్తు చేస్తేనేగాని విషయ నిర్ణయం చేయవలనుపడదు. ఈ విషయాన్ని నిర్ణయించడానికి ఇంక మార్గం ఏమున్నది? ఇది నా మనస్సునకు మించిన సమస్య. ఈ సమస్యను పరిష్కరించడం ఎలా? అని బహుభంగులుగా విమర్శించి మళ్ళీ ఆ చెలికత్తె అయిన కేశినిని పంపి ఇంకా కొన్ని కూపీలు తీసిగాని నిర్ధారించడం కుదిరేలా లేదు. అందుచేత కేశినినే పంపుదును అని నిశ్చయించుకొని కేశినిని చేరి "చెలియా! నువ్వు చెప్పిన విషయాలు చాలాభాగం బాహుకుడే నలుడని చెప్పవీలగుచున్నది. రూప విషయాన్ని బట్టి చూడగా ఇంచుకంత సంశయం రాక మానడం లేదు. కాబట్టి నువ్వు విసుగుచెందక రాజ రహస్యం దీన్ని ఛేదించుట అంటే మా ఇద్దర్నీ కలపడానికి నువ్వింకా తీవ్రంగా ప్రయత్నించాలి. బాహుకుడి వద్దకుపోయి అతడు ఋతుపర్ణుడియొద్ద వంటలవాడుగాకూడా ఉంటున్నాడని విన్నదానను. ఏదో వంకపెట్టుకొని మెల్లిగా బాహుకుడి వద్దకు పోయి ఆయన వంటా వార్పూ చేయు పటిమా మరికొన్ని ఇతర విషయాలూ తెలిసికొని రమ్ము. ఇప్పుడే నువ్వు

అచ్చొటికిపోయి తెలివిగా మాట్లాడి బాహుకుడు నలుడో కాదో తెలుసుకురమ్మని మళ్ళా కేశినిపై భారంపెట్టి నలుడి యొద్దకు గూఢచారి చర్యకు పంపింది.

ఆ చెలికత్తె ఆమె ఆజ్ఞ ప్రకారం రెండవసారి దౌత్యం నెరపడానికి బాహుకుని వంటయందలి ప్రావీణ్యాన్ని తెలుసుకోడం ద్వారా నలుడి సత్య విషయాలను సేకరించి దమయంతితో ఇలా చెప్పింది.

"ఓయి! తల్లీ! నీ ఆజ్ఞ ప్రకారం బాహుకుడి వద్దకు వెళ్ళి వచ్చాను. అపూర్వమైన క్రొత్తవిషయాలను తెలుసుకు వచ్చాను. అతని కార్యాలు ఇదివరలో విన్నవీకావు చూసినవీ కావు. అటువంటి విషయాలను తెలుసుకున్నాను. చెప్తున్నా విను.

"ఆ బాహుకుని పాకశాస్త్ర విషయాలను తెలుసుకోగోరి నువ్వు చెప్పినట్లుగా ఆతనివద్దకు వెళ్ళి పాకక్రియ ఆరంభించటానికి కొంచెం ముందుగానే వెళ్ళి ఆయనతో సంభాషించటం మొదలుపెట్టాను. అంతలో వంటకు వేళ అయిందని గమ్మున లేచి రెండు మూడు గడ్డి పరకలు చేత్తో పట్టుకుని ఇటూ అటూ తిప్పి పొయ్యిలో పడేశాడు. అదే ఆయన చేసినది. అంతటినుంచి మంటలు లేచి వంటచెరుకు అక్కర్లేకుండానే మండడం మొదలుపెట్టడం అలానే వంట అంతా ముగియడం జరిగిపోయింది. ఇంకా వినండమ్మా! అతను ఏ పాత్రలోనూ ఏ మాత్రం నీళ్ళు పొయ్యలేదు. అక్కడే వున్న నేను ఆతను చేయు ప్రతి పనీ జాగ్రత్తగా పరిశీలించుతున్నాను. వంట పాత్రలలోనికి నీరు ఎలా వచ్చిందో తెలి

యము. కావలసిన వంట పాత్రలలో నీరు నిండుగా ఉంది. అంతేకాదు అతడు పనికి నీళ్ళు ఉపయోగించేవి ఉపయోగించుతూన్నాడు. తిరిగి పాత్రలు నీటితో నిండిపోతున్నాయి. నీరు పాత్రలనుండి తీసిన వెంటనే పాత్రలు తిరిగి నీటితో నిండిపోయి ఉంటూండడం చూసా. అట్టిది చాలా ఆశ్చర్యం అనిపించింది.

దీన్నిబట్టి ఆలోచిస్తే అతను కేవలం నరుడుగా తోచడంలేదు. ఏ మహిమాన్వితుడైన ప్రభావంకల ఏ దేవుడో అయివుండాలి. లేకపోతే అటువంటి మహిమ ఎలా అతను పొందిఉండును? వంటకోసం ఉపయోగించబూనిన కాయకూరలు ఆయన హస్తస్పర్శ మూలంగా అత్యంత నవ నవంగా కనబడసాగాయి. పోనీ పువ్వులను చూస్తే అవీ అట్లాగే వాడినవి కూడా అతని చేతి తాకుడికి నూతన పుష్పాలుగా కనబడజొచ్చాయి. ఇక వండిన సరుకులు చూడ్డానికి ఎంతో యింపు సువాసనలూ రుచులూ అత్యద్భుతం. పోపు సువాసనలు నాలుగు మూలలకు వ్యాపించి కనువారికి నోరూరింపచేసేటంత పసందుగా తయారు అవుతున్నాయి. అతడు మాత్రం వికృతాకారం కలిగి ఉన్నాడేకాని అతను చేస్తూన్న పనులు చాలా అద్భుత జనకాలుగా వుంటున్నాయి.

నాకట్టి వాతావరణాన్ని చూడగానే ఏ మహాత్ముడో కారణవశంచే ఇలా జన్మించాడా అనిపించింది. నువ్వు పంపగానే వెళ్ళి నే అతని చెష్టిములు చూచి వచ్చినవి యవి. ఈ విధంగా కేశిని గమనించిన అపూర్వ విషయాలు బాహుకుడి గురించినవి దమయంతికి ఎరిగించింది.

దాసి అయిన కేశి చెప్పిన విషయాలన్నీ దమయంతి జాగ్రత్తగా వింది. అనంతరం తన మనస్సులో అనుకుంది. "కేశిని వచించిన గుర్తులూ విశేషాలనుబట్టి తలంచగా బాహుకుడు నలుడే అయివుండునని నిశ్చయంగా తోస్తోంది. నిషధాధీశుని గుణాలూ బాహుకుడియందు గలవీ ఒకటే అయివున్నాయి. ఇంతమాత్రంచేత చాలదు. తొందరపడితే ఏది ఎలా జరుగునో, కష్టంలో వున్న మనస్సు పక్షపాతంతో కంగారుపడుచుండును. అందుచే వివేకంతో వర్తించితేకాని సత్యం రూఢిగా తెలియజాలదు." అని ఆలోచించి మళ్ళా వెనుకటి అదే చెలియను పిలిచి "కేశినీ! ఇంతవరకూ రెండు సార్లు బాహుకుడి వద్దకు వెళ్ళి చాలా విషయాలు జాగ్రత్తగా తెలుసుకువచ్చి చెప్పావు. అలాగే మూడోసారి కూడా ఇంకా మరికొన్ని ధృవపరిచేలా వార్తలను సేకరించి రావాలి. బాహుకుడి యొద్దకు పోయిరమ్మా. నువ్వు చేసే దౌత్యం ఫలించేలా ఉంది. నా విధి లిఖితం ఎలా వుందో మరి?

నువ్వు నలునికి సంబంధించినవిషయాలని చాలా చాతుర్యంతో నిర్వహించగల రాయబారివి. ఈ అంతఃపురంలో నీతో సమానంగా రాయబారం నెరపగల జాణలు ఎవరూ లేరు. కావున ఈసారికూడా నువ్వే వెళ్ళు. ఈసారి నువ్వు కొత్త పంథాని నిర్వహించాలి. ఇదిగో ఈ ఇద్దరు పిల్లల్నీ అంటే ఇంద్రసేననీ ఇంద్రసేనుణ్నీ నీతో తీసుకువెళ్ళు. నా ప్రియపతి వర్తనం పిల్లల్ని చూసినతర్వాత ఎలా ఉండునో తెలుసుకో. ఆయన చూపే ప్రేమ చనువు ఇంకా ఆయన చూపులు పలకరింపు మనోభావాల ప్రదర్శన మొదలయిన

విషయాలను గమనించు. అతడు సంతానాన్ని చూస్తే నిజమైన తండ్రి మెలా వుంటాడునో చూడు. ఊరుకుని ఉండలేడు కదా! ఈసారితో బాహుకుడు నలుడో కేవలం బాహుకుడో బాగా ఆనవాలు దొరుకును. ఈసారికూడా నువ్వు తెలివిగా ప్రవర్తించి నిక్కచ్చిగా నలుని గురించిన వాస్తవాలను చివరగా తేల్చి రమ్ము. పొమ్ము" అని ఇద్దరి పిల్లల్ని ఆమెతో పంపి ఆమె రాకకై ఎదురుచూస్తూ ఆదుర్దాగా వుంది.

## నలుడు బిడ్డలని చూచుట

దమయంతి చెప్పి పంపిన కేశిని ఇద్దరు పిల్లల్ని తీసుకుని బాహుకుడు ఉండే పాకశాలకు వెళ్ళింది. కొద్దిసేపు అవీ ఇవీ మాటలాడి తనతో ఉన్న నలుడి పిల్లల్ని చూపుతూ "ఆర్యా! ఈ పిల్లల్ని చూశారా? వీరిద్దరూ నలునికి దమయంతి కలిగినవారు! నలచక్రవర్తి రాజ్యాన్ని కోల్పోవుటకు ముందే వీరిద్దర్ని విదర్భకు తల్లి దమయంతి ముందు ఎట్టి కష్టాలు వచ్చినా పిల్లలు సుఖశాంతులతో ఇక్కడ వుండగలరన్న ధీమాతో పంపించింది. అది లగాయతు ఈ పిల్లలు ఇక్కడే అంటే తాతగారి వద్దనే వుంటున్నారు. అటువంటి నలమహారాజు బిడ్డలుకూడా దుర్విధి కారణంగా పరాయి గృహంలో వుండవలసిన స్థితి యేర్పడింది. వీరికి తండ్రి వున్నాడు. అయినా లేనివారిలా పరులయింట నివసిస్తున్నారు. తాతగారూ అమ్మమ్మా ఎంత ప్రేమగా చూసినా తండ్రి ప్రేమతో సాటిరావు ఎంతటి ఆత్మబంధువులు అయినా ఇది తమ గృహంకాదు. విధిరాత దాటడం ఎవరి

తరం! ఈ పిల్లల నుదుట రాత ఇంకా ఎన్నాళ్ళకు బాగుపడ గలదో" అని బహుదీనంగా పిల్లల చెక్కిళ్ళు గిల్లుతూ వార్ని చూపింది.

దాసి అయిన కేశిని తీసుకునచ్చిన బిడ్డల కేసి ఓ దృష్టిని నిలుపుతున్నాడు నలుడు. వారు తన బిడ్డలని చూడగానే నలుడు హృదయంలో కలత చెందాడు. రాజు నాటి సన్ని వేశాన్ని చూసి చాలా బాధపడ్డం మొదలుపెట్టాడు. ఆ బిడ్డలు తన సంతానం అని తెలుసుకోగానే దుఃఖం అతని దుర్భరం పెరిగిపోయింది.

తన ప్రచ్ఛన్న వేషం రూపం కేశిని బోధపడకుండాలని తరంగాల్లా ఉబికివస్తూన్న దుఃఖబాధను దిగమింగుకోడానికి ఎక్కువగా ప్రయత్నిస్తున్నాడు.

నలుడు దుఃఖం ఆపుకోలేక తన బిడ్డల్ని ఎట్టఎదుట చూస్తూ ఉండలేక ఒక్కసారి దగ్గిరగా తీసుకుని తన ఒళ్ళో ఒక్కర్ని తొడపై ఒకర్ని కూర్చోబెట్టుకుని కనుల నీరు తిరుగుతూంటే లాలనగా ముద్దులాడుతూ కేశిని అను పరిచారికతో నలుడు ఇలా అన్నాడు.

ఈ బిడ్డలు చూడముచ్చటగా ఉన్నారు. ఓసారి ఈ చిన్నారి పాపల్ని వారి అందచందాలనిబట్టి ముద్దాడాలని దగ్గిరగా తీసుకున్నా. ప్రభు సంతానాన్ని లాలించునంతటి వాణ్ని కాను. అయినా దైవస్వరూపాల్లా కనబడే యీ బిడ్డల్ని చూస్తూంటే లాలించకుండా ఉండలేకపోతూన్నా. ఓ సారథి

ఓ వంటలవాడు రాజ సంతతిని లాలించుతున్నాడు అని నువ్వు కోపగించవు కదా? విను. నాకూడా ఒకప్పుడు ఓ కొడుకు ఓ కూతురూ ఉండేవారు. ఆ నా సంతానం కూడా ఇలా ముద్దులొలికేలా ఉండేవారు. ఈ చిన్నారుల్ని చూసేసరికి ఆ నా పిల్లలు గుర్తుకొచ్చి ఇలా చపలభావంతో ప్రవర్తించా. ఇంత మాత్రానికి అన్యథాగా తలంపకు. ఇదిగో ఈ బిడ్డలనింక తీసుకుని వెళ్ళు" అని ఆ బిడ్డల్ని ఆమె దగ్గిరకి పంపి ఇంకా ఇలా అన్నాడు.

"ఓ అంతఃపుర కాంతా!" అని ఇలా చెప్పాడు. "నేనో సేవకుణ్ని. పైగా పరదేశిని. ఓ రాజు క్రింద నౌకరీ చేసుకుంటున్నా. ఆ రాజు ఆజ్ఞని అనుసరించి ఇక్కడికి వచ్చా. అంతఃపుర పరిచారికవు నువ్వు. మాతో నీకెట్టి పనీ లేదు. ఏవో వచ్చి విషయాలు అడిగావని జవాబులిచ్చాను. ఇందులో నువ్వు కోపించవలసినది ఏంలేదు. నువ్వు ఇక్కడికి వస్తున్నావంటే ఇది మంచిది కాదు. ఎవరు చూసినా ప్రమాద కరమైనది. ఈ సీరింక ఎంతమాత్రం అటు నీకుగాని, ఇటు నాకుగాని చూచువారికిగాని హర్షణీయమైంది కాదు. ఇటు పైన నువ్వు ఇక్కడికి రాతగదని హెచ్చరించుతున్నాను. తోచినదే తడవుగా నువ్వు ఇక్కడికి రావద్దు. "రాకు" అని చాలా గట్టిగా చెప్తున్నా. వెళ్ళు అని చెప్పి ఆమెను పంపి వేశాడు.

దమయంతి చెలికత్తె పిల్లలిద్దర్నీ తీసుకుని అంతఃపురానికి కేశిని చేరి ఇలా అంది. "అమ్మా! ఈ దౌత్యకృత్యంలో తేలినదేమంటే కొన్ని విషయాలు తేడా పాడాగా వునా౯

మొత్తంమీద బాహుకుడిలో నలుడి లక్షణాలు ఎక్కువగా కనబడుతున్నాయి. నాకు అన్ని రకాలుగా అతడు అనగా ఆ బాహుకుడు నిషధరాజే అనిపించింది. నలుడి లక్షణాలే హెచ్చుగా బాహుకుడిలో కానవగుచున్నాయి. నాబోటి దానికి విషయ విమర్శను బాహుకుడూ నలుడూ ఒక్కరే అని తోచుతూండగా సహధర్మచారిణిగా ఉన్న నీకు యీ విషయం ఇంతకంటే స్పష్టంగా అర్థంకాకుండునా? నాకు తోచినంతవరకూ నా బుద్ధిననుసరించి నా అభిప్రాయాన్ని వెల్లడించాను. ఇటుపైన మీరే యోచించి ఒక నిశ్చయానికి రావలసి వున్నది. అటుమీదట మీరేమి చేయమన్న అది తప్పకుండా చేస్తా. మీ ఆజ్ఞ కెదురుచూచుచుండదానను" అని చెప్పింది.

చెలికత్తె అయిన కేశిని చెప్పినదంతా దమయంతి వింది. సహేతుకంగా మాటలాడిన ఆమె మాటలని విసంషం లోలోన ఉప్పొంగింది. అప్పుడు దమయంతి ఓ నిర్ధారణకు వచ్చింది. బాహుక నామధేయుడు తన ప్రియ పతి అయిన నలసార్వభౌముడే అని నిర్ధారించుకోడంతో హృదయంలో సహస్రకిరణుడంత కాంతి ఉదయించింది, ఇంతకాలంగా విచారాలతో వాడిపోయిన ముఖ కమలం వికసించింది. కాని నలుడు మంచి ఆజానుబాహు విగ్రహుడు. సుందరరూపధారి. ఈ వికృతాకారం హ్రస్వాకారం ఎలా వచ్చిందో కారణం అర్థంకావడంలేదు. అది తప్పితే అతనిలో అన్నీ నలుడి లక్షణాలే గోచరిస్తున్నాయి. ఏ విధంగా చూసినా వికృతా

కారం మాట అలా వుంచితే తతిమా సంగతులు అన్నింటా నలుడి ఛాయలు నిరభ్యంతరంగా కనిపించాయి.

కొద్దిసేపట్లో తన ప్రియ పతిని చూడబోతున్నానన్న ఆనందం వరద నదిలా పొంగి పొరలజొచ్చింది.

ఆలోచించుకుని నిశ్చయానికి వచ్చి తన తల్లిని సమీపించి "అమ్మా! నా భాగ్యం పండింది. నా దురదృష్టం దూరం అయేరోజు దగ్గిరకొచ్చింది" అని సంతోషంతో కలకలలాడుతూ చెప్తూంటే "ఏమిటమ్మా?అదెలా?" అని ప్రశ్నించింది తల్లి దమయంతిని.

దమయంతి తల్లితో ఇలా అంది. "అమ్మా! మన రాజధానికి ఋతుపర్ణుడు వచ్చాడుకదా!"

"ఔను. అయితే ఏమిటి?"

"ఆ రాజుతో బాహుకుడను రథసారథి వచ్చాడు. అతను బాహుకుడను పేరుతో వికృతాకారంగా వున్నాడు. ఆ బాహుకుడే నా ప్రియ పతి నలసార్వభౌముడు. అతని ఆకారం, వాలకం, రథసారథ్య చాతుర్యం అవీ ఇవీ కలిపి అన్ని లక్షణాలూ గమనింపచేశాను. ఈ కృత్యం అంతా నడిపినది దాసి కేశిని. ఆతని గుణాలనూ అతని వంటా వార్పూలోని ప్రతిభ, అశ్వపరీక్షవంటివి అన్నీ నలుడి లక్షణాలే బాహుకుడిలా కనబడుతున్నాయి. ఈ విషయంలో చాలా సహేతుకంగా యుక్తియుక్తంగా కూపీ తీయించాను. చివరికి బాహుకుడే ఆ నలచక్రవర్తి అని తేల్చాను. ఇంక అమ్మా! నువ్వు మీనమేషాలు లెక్కించక గౌరవ పురస్స

రంగా ఆయనని ఇక్కడికి రప్పించండి. ఆయన నలుడని తెలిసిన తర్వాత ఆయన్ని చూడాలని నా మనస్సు తత్తరపడుతోంది. ఆయన కంఠస్వరం వినాలని నా మనస్సు ఉవ్విళ్ళూరుతోంది. అతన్ని దర్శించాలి; అతని మాటలు వినాలి. అతనితో సంభాషించాలి. ఇక ఆలస్యాన్ని తట్టుకోలేను. మరట్లు చేయకపోతిరా? నన్ను ఆతని కడకు పోవనాజ్ఞనైనా ఇవ్వండి. తక్షణ కర్తవ్యం ఆలోచించాలి" అని ఉత్సాహోద్రేకాలతో ఆనంద పారవశ్యంతో అంది.

## దమయంతిని బాహుకుడు దర్శించుట

ఆ మాటలు విన్న తల్లి తన కూతురు చెప్పినరీతిగా సంతోషంతో చెయ్యడానికి అంగీకరించి ఇందులోని వాస్తవాన్ని దమయంతి చేసిన ప్రయత్నాలనీ విదర్భరాజుకి వివరించుతూ..."అంచేత నలుడే బాహుకుడు కాన ఆతన్ని ఇక్కడికి రప్పించడానికి తగిన ప్రయత్నాలు చేయించండి" అని సలహా ఇచ్చింది.

నలుడి జాడ విన్న విదర్భరాజు ఎంతో సంతోషించి తప్పకుండా ఆ బాహుకుణ్ని మన ఆస్థానానికి రప్పించదలచా. ఇప్పుడు ఆ ప్రయత్నాలు చేయింపబూనుకుంటున్నా" అని చెప్పి మంత్రిని రావించి "అమాత్యా! మీరు వెళ్ళి ఋతుపర్ణుడితోపాటు రథం తోలుకుని వచ్చాడు బాహుకుడను వాడు. అతన్ని ఇచ్చటకు శీఘ్రం ఏదో విషయం మాట్లాడాలని చెప్పి పాకశాలయందు భోజనంచేసి విశ్రాంతి తీసుకుం

టున్న యాతనిని ఇక్కడికి తీసుకురండి. వెళ్ళండి ఇప్పుడే" అని దమయంతి తండ్రి మంత్రిని పంపాడు.

ఇంక ఇక్కడ నలుడు భుజించి నేలపై పరుండి ఇలా తలంచసాగాడు. "ఎంతో అత్యున్నత దశకి వెళ్ళి పతనమైపో యాను. అధః పతనమైపోయాను. రాజ్యం లేదు, భార్య లేదు; పిల్లలు లేరు; సంఘంలో నామరూపాలు లేకుండా నాశనమై పోయా. అసలు ఇక్కడికి వచ్చినపని దమయంతికి స్వయంవరం అని. అసలు ఆ విషయాన్ని గురించిన వార్తయే లేదు" అని తలంచుకుంటూన్న బాహుకుడి దగ్గరకు మంత్రి వచ్చి అతన్ని చూసి "ఓయి! బాహుకా! మా ప్రభువైన భీమమహారాజు నీతో ఏవో సంగతులు మాట్లాడాలట. అందుకని నిన్ను వేగంగా తీసుకు రమ్మని పంపగా నిన్ను తీసుకువెళ్ళడానికి వచ్చా" అని నలుణ్ని వెంటబెట్టుకుని మంత్రి భీమరాజు వద్దకు తీసుకువెళ్ళాడు. మంత్రి రాజుతో మీరు తీసుకు రమ్మని ఆజ్ఞాపించిన బాహుకుడను అశ్వ సారథి ఇతడే. అనంతరం యేలినవారి చిత్తం" అనగా భీమరాజు ఆపాదశిరః పర్యంతం తన యెదుట నిల్చున్న బాహుకుణ్ని తేరిపార జూచి ఇలా అనుకున్నాడు. "ఈ వికృతాకారుడు నా అల్లుడు నలుడా? నమ్మశక్యం కాకున్నది. ఆనాడు నే చూసిన నల రాజు దర్శనీయాకృతి కలవాడు. ఇతన్ని నలమహారాజు అని అంటోంది నా కూతురు. ఆ సార్వభౌముడి గుర్తులితనిలో ఏ ఒక్కటీ కూడా కానరాదు. ఇందులో సఖురాండ్ర మోసమే దైనా ఉండినదా? లేకపోతే యీ వికృతాకారుణ్ని నలుడని అనడం అంటే ఏం అర్థంకాకుండా వుంది. ఇతనిలో ఏ రూపు

చూసి ఇతడు నలుడని నిర్ధారించి వుంటుంది? నా కూతురు చాలా తెలివైనది. తొందరపడి ఏ విషయంలో నిర్ణయానికి దిగే మనిషి కాదు. ఆమె పొరపడునదియూ కాదు. సరే ఆమె చూసిన ఏమంటుందో తెలియాలి.” అని ఆలోచించి వెంటనే అతన్ని దమయంతి వున్న చోటుకు తీసుకువెళ్ళమని యాజ్ఞాపించాడు స్త్రీ దేవ్వారికులను భీమరాజు. నలుడామెని అనుసరించి వెడుతూ ఇలా తలపోయసాగాడు.

“ఈ అంతఃపురంలో చాలా నీచ సేవకుడిలా ఉన్నా. ఒకప్పుడు యువమహారాజుగా మా తోవలలో దాసదాసీ జనులు అనుసరిస్తూంటే మరొకచోట జయా! విజయీభవ! అని మరికొందరు అంటూంటే రాజాధిరాజ రాజపరమేశ్వర మహారాజ కంఠీరవా! అని మరికొన్నిచోట్ల బహుపరాకులు చెప్తూంటే ఎంతో రోమహర్షణంగా దమయంతి వ్రేలుని పట్టుకు నడుస్తూంటే భూసురాశీర్వాదాలు గొనుచు పుణ్య స్త్రీలు మంగళహారతులు పాడుతూంటే యీ ప్రాంతాలలో కనులనుంచి ఆనందబాష్పాలు రాల్తూంటే సైనిక వందనం గ్రహించుతూ స్త్రీలు సఖురాండ్రూ పూలు పేలాలు జల్లుతూంటే పులకించిపోతూ నడిచిన యీ చోట్లలో యీ శృంగాటకాలలో సేవక బృందాలు బరాబరులు చేస్తూంటే ఆ మనోహర దృశ్యాలు తిలకించుతూ ఇటు మహారాజు! ఇటు ఇటు రాజా! అని వేత్రధారులు పాదాలపై పూలు జల్లుతూంటే ముందుకుసాగి రంగవల్లులు తీర్చిన ముంగిళ్ళు దాటిపోతూ ఉత్సాహోద్రేకాలు మితిమీరేలా వాద్య ధ్వనులు శ్రవణానందం చేస్తూంటే కర్పూర నీరాజనాలందు

కున్నా మధురక్షణాలు...అవి...అలాంటివి....ఇక్కడ పన్నీటి జల్లులతో...ఇక్కడ అత్తరువు సుగంధాలు గుబాళించిన పూతోరణాలు ప్రతిమాలాంకృత సుందర వేదికలు ఆహా!...ఆహా!...ఇక్కడే సంగీత నాదాల సరిగమ భంగులు చెలరేగుతూండ కన్నియల భరతనాట్య ప్రక్రియల రవళులు వింటూ అనేక సౌందర్యాలు కంటూ యీ సోపానాలు ఎక్కుతూ...అటు...ఆ సోపానాలు దిగుతూ ఓహోహో! ఆనాటి ఆ నలరాజు...ఈనాటి యీ కుత్సిత వేషధారి... ఎంతటి విధివిలాసం...ఉన్మత్తునిలా యీ గెడ్డం యీ మీసాలు అసలు సంస్కారానికి నోచుకోని యీ దేహ పరిస్థితి... ఇద్దరు చెలికత్తెలు తీసుకువెడుతూంటే వారివెంట ఓ చీర పీలిక దాల్చి యీ పొట్టి చేతులతో ఆ కట్టుగుడ్డను సర్దుకుంటూ ఓ మర్కటంలా ముందుకు వెడుతూన్న యీ నా దుస్థితి...నిజంగా గర్హనీయం. ఆ సుందర శిఖరాలమీద తేలియాడే రాయంచ దమయంతి చెంతకు యీ నా తేలిపోతూన్న కాళ్ళతో తడబడుతూన్న అడుగులు వేసుకుంటూ...ఇలా నేను...అనుకుంటూ నడచి వెళ్ళి దమయంతి ఉన్న తావును చేరాడు నలుడు.

నాలుగు మూలలా నలుడు కలియజూసాడు. "ఇక్కడ దమయంతి ఎవరు? ఆ అందకత్తె అగునా యీ సుందరి అయివుండునా దమయంతి. అదే ఆ ఆ ఆమె నా మనోనాయక. "ప్రథమానురాగంబు రాజహంసము చేత కబురు పంపినయట్టి కలికితనము" ఆహా! ఆనాటి అలనాటి మనోహర వధువు. ఎక్కడా కానరాకున్నది. అయినా దమయంతి క్రీడాసౌధం

ఏది? ఇది పాడుబడిపోయిన మందిరం. ఇదేం దాసీలు? కళా కాంతీ లేకున్నారే? రాజాంతఃపురంలో హంసతూలికా తల్పాలు ఉంటాయికాని ఇది కటికి నేల. ఏమి యీ విషాదావతారాలు. విచార వదనాలు? లేవలేక నడవలేక వాడిపోయి దుమ్ము కొట్టుకుపోయి నేలపై పొరలాడుతూ ముష్టిదానిలా ఏ అలంకారాలు లేక కన్నీటి కాలువలతో ఉబ్బిపోయిన కనులు కాంతిలేని మొహం, క్రుంగి కృశించిపోయిన వృద్ధురాలిలా ఎగురుతూన్న చిరు వెంట్రుకలు ముఖాన్ని కప్పుతూంటే చూడ్డానికే బరువైన కనులతో ఈ లోకాన్ని చూడ్డం అనవసరం అన్న నిరాశా నిస్పృహలను చిమ్ముతూన్న దృష్టులుగల దమయంతిని పోల్చుకున్నాడు. చరచరా పరుగున వెళ్ళి "నా అర్థాంగి! దమయంతి" అని పలకరించాడు.

అప్రయత్నంగా దగ్గిరగా వున్న నలుడి పాదాలపై పడిపోయింది ఆమె శిరస్సు నలుడప్పుడు వంగి లేవనెత్తి అక్కున అద్దుకున్నాడు. దమయంతి కన్నులనుంచి కన్నీటి ధారలు అదేపనిగా ఒలికి ఒస్తూంటే నలుడు ఆ ధారలని తుడుస్తూ ఏకవేణిగా అయిన శిరోజాలని పైకి ఎగవేస్తూ "విచారించకు. కలి దోషంవల్ల కష్టాలకు లోనైనాము. నేనో నీచ సేవకుడిలా నువ్వో నీరస సేవకురాలిలా అయిపోయాం. మనతో విధి ఆడుకొంది. దాని ఆటకు మనం బలి అయి పోయాం. దుర్దైన హస్తం మనలని వెంటాడి ఇన్ని బాధలు పెట్టింది." అంటూన్న ప్రాణపతి అగు నలునితో దమయంతి ఇలా అంది.

"నేటికి దర్శన భాగ్యంగా నాకు దర్శనం ఇచ్చారు. ఓ ప్రాణపతీ! మీలో ఎంతటి నిర్దయ కలదు? అలసి సొలసి అరణ్యంలో అంటే ఏకాంత ప్రాంతం నిర్జనం అయినది త్రోవలు లేనిదీ వన్యమృగ భయంకరమైనది అయిన అరణ్యంలో మీ ప్రక్కనే నిద్రలో వుండగా ఆ నా చీర అదే ఇది ఇప్పటికీ ఆ చీర ముక్కతోనే వున్నారా?" అనగా "నువ్వు కూడా ఆ మిగిలిన ఆ చీర ముక్కనే ధరించి ఇప్పటికీ అలానే వున్నావా?" "ఔను స్వామీ!" అలా విడిచిపెట్టి వచ్చారుకదా న్యాయమేనా? ఇట్టి కృత్యం మీరు నాకు చేయదగిందేనా?" అంటూంటే "కాదు" అంటూన్న ప్రియ పతిని చూసి ఇంకా ఇలా అంది.

"ఆర్యా! దిక్కు లేక దిక్కుతోచక ఆ అడవులంపట పరిభ్రమించడం మొదలుపెట్టాను. నాథా! నాథా! అంటూ తొట్టుపడుతూన్న పాదాలతో ఆ ముళ్ళ నేలమీద ఒక్కర్తెనే నడుచుకుంటూ ఏ క్రూరమృగం బాధిస్తుందో ఏ దుష్టుడు ఏం చేస్తాడో అని దిగులుపడుతూ భయం చెందుతూ తిరుగాడజొచ్చాను.

## పాముబారి పడిన దమయంతి కథ

దిక్కులు పిక్కటిల్లేలా నాథా! నాథా! ఎక్కడ? భయం భయం కాపాడండి అంటూ కేకలు వేస్తూ చైతన్యం లేకుండా క్షుత్పిపాసలతో అలమటించుతూండగా ఒక పెద్ద పాము; నే తొక్కానో యేమో తెలియదుకాని అది నా పాదాన్ని పట్టుకు మింగడానికి ఆరంభించింది. విదిలించుకో

డానికి ప్రయత్నించా. అబ్బే అది విడవలేదు. భయంతో రక్షించండి బాబూ! పాము పట్టుకుంది అంటూ ఆర్తనాదం చేయగా కేక దూరంలో తిరుగుతూన్న ఓ బోయ ఎలాగో నా కేక విని అక్కడికి పరుగునవచ్చి "అయ్యో! ఎవరో ఈ దేవి?" అని "అయ్యబాబోయి! ఎంత పెద్ద పాము పట్టు కుంది? మింగేస్తోంది. దీని నోటబడిపోయింది. ఇప్పుడు నే దీన్ని చంపి యీమెను రక్షించకపోతే యీమె పని సరి. ఈమె పూర్తిగా ఈ పాము బారి పడిపోయింది." అంటూ "అరెరే" అని తన చేతిలో వున్న కత్తితో దాని చుట్టలను తెగగోసి ఆ పాము నుంచి జాగ్రత్తగా కాపాడాడా బోయ. తదుపరి ఆ కిరాతుడు ఆమెను ఆ దగ్గర్లో వున్న చెరువు ప్రాంతానికి తీసుకువెళ్ళి కాసిన్ని నీళ్ళు త్రాగనిచ్చి అటూ ఇటూ తిరిగి అక్కడ దొరికే ఫలాల్ని తెచ్చి ఆమెకిచ్చి విశ్రాంతి తీసుకోనిచ్చాడు. ఆ తరువాత దమయంతిని ఇలా ప్రశ్నించాడు?

"ఓ చిన్నారీ! నువ్వు ఎవ్వరికి చెందినదానివి? ఇలా అడవికెందుకు వచ్చావు? ఇలా ఒంటరిగా తిరుగుతూన్న కారణం ఏమిటి? నీకు దిక్కెవరు? ఏ ప్రాంతం నీది?" అని అడిగాడా బోయ. ఆ మాటలు విన్న దమయంతి కిరాతుడికి ఇలా బదులు చెప్పింది.

"ఓయీ! కిరాతుడా! నే నిషధరాజుకి రాణిని. మాది నిషధదేశం. ఓ కారణం వల్ల మేమిద్దరం యీ ఘోరాడవికి వచ్చాం. నే నిద్రపోతూండగా నా భర్త ఎందు లకో ఎటకో దారి తెలియకో తప్పిపోయాడు. ఏ ఆధారం

లేక ఆకలి దప్పికాలకు బాధచెందుతూ సంచరిస్తూన్న నన్ను యీ పాము మింగజొచ్చింది. ఇంతలో దైవవశాత్తూ నువ్వు ఇక్కడికి వచ్చి రక్షించావు. నీకు మేలు అవుతుంది'' అని తన దుఃఖ గాథను కొంత చెప్పాను.

ఆ దుష్టుడు ఒంటరిగా వున్నానని తలచి ఏ దిక్కూ లేదని ఎంచి నా పైకి దుర్బుద్ధితో రాజొచ్చాడు? చాలా విధాలుగా వారించాను. కాని వాడు మానక బలాత్కారంగా పై బడజొచ్చినంతనే తీవ్ర కోపానలదృష్టుల్ని వాడిపై ప్రసరింపజేయగానే వాడు భయపడి నా దృష్టసారానికి తట్టుకోలేక తాళలేక హఠాత్తుగా భయపడిపోయి మరణించాడు.'' అని చెప్పి దమయంతి "నాథా! నన్ను ఇలా కష్టాలపాలు చేయబూనడం న్యాయమా? ధర్మమా?''

"నే మీకు సహధర్మచారిణిని. కష్టాలో సుఖాలో మీతో పొందవలసినదాన్ని. అర్ధ్యామధ్యగా నన్ను ఏకాకినిగా విడిచి పిల్లలుగలదాన్ని మీయందే ప్రాణాలు పెట్టుకు బ్రతికేదాన్ని, వేల్పుల్ని కూడా కాదని మిమ్ము వరించిన దాన్ని. అలాంటి నన్ను ఏమాలోచించక గమ్మున విడిచి మీ యిచ్చిన రీతిని చనుట ఎవరునూ హర్షించరు! ఏ శాస్త్రం ఒప్పుకోదు! మీ తోటిదే లోకం అని నమ్మి ఉన్నదాన్ని.''

"ప్రియ దమయంతీ! నువ్వు నాకీలోకం ప్రాణసమానురాలవు. నువ్వు లేకుంటే ఈ లోకం నాకు అంధకారబంధురం. ఏ క్షణం కూడా నిన్ను విడిచి ఉండలేనని అంటూండేవారే? అట్టి మీరే బేలతనం పూని ఇలా కాన

రాకుండా వెళ్ళి యేం చేసినది వుంది ప్రభూ! సుఖాలనుభవించడంలో ఎంత ఆనందం వుందో భర్తతో కష్టాలు కూడా అనుభవించడంలో అంత బాధ్యత కలిసికట్టుతనం ఉండి అది కూడా ఆనందమే అవుతుంది" అని అంటూంటే దమయంతి కన్నులనుండి రాల్తూన్న అశ్రువులని తుడుస్తూ "నిజమైన భార్య భర్తతో సుఖాలనుభవించుతూ ఎంత ఆనందపడుతుందో భర్తతోపాటుగా అనుభవించే కష్టాలు కూడా అలాగే భార్యకి ఆనందాన్ని ఇస్తాయని గ్రహించలేకపోయాను" అని దమయంతిని చూసి భోరున నలుడు ఏడిచేసాడు. తాను చేసినది తప్పని భావించుకుంటూ అధైర్యపడిపోతూ ఒణికిపోతూన్న కంఠస్వరంతో దమయంతిని చూసి నలుడు ఇలా అన్నాడు.

"నీతో సుఖాలలో ఓలలాడుతూ బరువు బాధ్యతలని విస్మరించి లోకాన్ని ఏమరిచివున్న రోజులవి. ఏ కష్టాలూ లేకుండా జీవితం అంతా ప్రియురాలు ప్రక్కన ఉండగా సుఖాలలో గబగబా గడిచిపోతూన్న రోజులవి."

"ఇంత మోసం ఇంతకష్టం ఇలాంటి గ్రహబాధ ఇంతలోనే ఇలా ముంచుకొస్తుందని అనుకోలేదు. ఎవరైనా నా మంచికోరి దుష్ట వ్యసనం మానమని చెప్పినా వినిపించుకోలేక ఆవేశంతో వ్యసనంలో మునిగిపోయి మోసగాళ్ళ వంచనకి సులువుగా లొంగిపోయి ఆపదలలో పడిపోయాను."

"భామా! రాజ్యంతోపాటు అందా ఆలిసీ ఆలోచననీ కూడా కోల్పోయి ఏం చెయ్యాలో తెలియక అడవులపాలయి జీవితాన్ని అధ్వాన్నం చేసేసుకున్నా. శుభాశుభాల్ని చెప్పే

వారి మాటల్ని కూడా పెడ చెవిని పెట్టా. అయిందికనక నే ఓ అధముడికి ఉచ్చదశ పట్టవలసి వచ్చినప్పుడు నాలాంటి వాడు అధమదశకు పోతేనేంకాని జరగదిది. అదే జరిగింది.”

“దేవీ! కలిబాధకి కష్టాలకీ గడగడలాడిపోయా. ఆ కలి బారినుండి కష్టాలనుండీ బయటపడ్డా. దమయంతీ ఇప్పుడు నేనిక్కడికి వచ్చింది నీకోసం కాదు. ఇంకోపనీ యేదీ ఉండి కాదు.

నిన్ను నే మనసా వాచా కర్మణా ప్రేమించుతూ నిన్నే నా జీవన దాతవుగా సర్వదా భావించేవాణ్ని. నే నీ కోసం అండగా కనిపించలేదని నెపం పెట్టుకుని పిల్లలు ఉండి విధి వంచన కారణంగా కష్టాలకు గురైనంత మాత్ర మున రెండవ స్వయంవరం దేశ దేశాల ప్రకటించడం నీలాంటి కుల స్త్రీకి పతివ్రతగా పేరుపడ్డ నీకు సంతానవతిగా వున్న నీకు ఇది ధర్మంగా అనిపించిందా? స్వయంవరం స్వయంవరం అని రాజాస్థానాలకు ఆహ్వానాలు పంపినమాట అవాస్తవమా? అందుకోసమేకదా ఋతుపర్ణుడు ఇక్కడికి వచ్చిన కారణం. అలా కాకపోతే ఆ రాజు ఇచ్చటికి రావలసిన హేతువే మున్నది? ఇటువంటి తప్పులు నీయందు వుండగా నాపై నిందలువేసి గోరంతలు కొండంతలు చేసి సంసారాన్ని రచ్చ కీడవడం నీవంటి ఉత్తమ ఇల్లాలికి ఉచితమనిపించిందా?” అని తన మనస్సులోని బాధతో కూడిన భావాలని దమయంతి ముందు ఏకరువు పెట్టాడు.

ఇలా ప్రసంగించిన ఇతడు తన ప్రాణపతి అని నిర్ధారించుకుంది. అంత ఉద్రేకంగా ప్రసంగించినా ఎంతమాత్రం దోషంగా తలంపలేదు. పైగా అతను చేసిన ప్రసంగానికి ఆశ్చర్యపడుతూ దమయంతి నాథుడయిన నలునితో అంది. "ఇందు నా తప్పిదం మనోవాక్కాయ కర్మలతో నే కోరియే దుష్కర్మనూ తలపెట్టలేదు. అసలు యందుగల సత్య విషయాలను చెబితే మీకు నాయందు గలిగిన సందేహం తొలగిపోగలదు. ఇందు నా అపరాధమే ఉంటే నన్ను క్షమింపమని ప్రార్థించుతున్నాను. నా సత్య కథనం వినండి నాథా! మీరు నన్ను అడవిలో విడిచి వెళ్ళినది మొదలు పాము ప్రమాదం బోయవాడు చేయబూనిన దుష్కర్మ మీకిదివరకు చెప్పాను. అనంతరం చేది దేశాన్ని చేరి రాజమాత ఆజ్ఞ ప్రకారం ఆమె వద్దకు వెళ్ళినా, అక్కడ సైరంధ్రీ వ్రతనిష్టతో వుండి అక్కడనుంచి రాజమాత నిషధ పుర ప్రయాణానికి ఏర్పాట్లు గావించగా విదర్భకు వచ్చాను. కొద్దిరోజులు గడచిన వెంటనే నలుగడలనూ మీ ఉనికిని కనిపెట్టడానికిగాను బ్రాహ్మణులను నా తండ్రి పంపెను.

వారిలో పర్ణాదుడనే బ్రాహ్మణుడు అయోధ్యకు వచ్చి నా మూలంగా ఏర్పడిన నుడులను ఆ రాజాస్థానంలో చెప్పగా మీరా మాటలకు బదులు చెప్పగా విని ఆ మాటలను ఆ బ్రాహ్మణుడు నాకు చెప్పగా బాహుకుడను పేరుతో వున్న మీరు నలునిగా గుర్తెరింగి మిమ్మిక్కడికి రప్పింపబూని స్వయంవరం మాట ఆ సభలో ప్రస్తావించడం జరిగింది. ఇంకనూ ఏమంటే ఆ స్వయంవరం రేపే జరుగును. అందుకు

లగ్నం రేపే నిర్ణయింపబడినది అనికూడా చెప్పించడం జరిగింది. కారణం ఏమంటే ముందురోజు సాయంత్రానికే విదర్భకు చేరాలి. నూరామడల దూరం ప్రయాణించాలంటే అది ఒక్క నలుడికి మాత్రమే సాధ్యమగునని ఎంచి అట్లు చెప్పించడం జరిగింది. ఈ విషయాలు చెప్పించుటకై సుదేవుడను బ్రాహ్మణుణ్ని ఋతుపర్ణుడి ఆస్థానానికి పంపడమైనది. స్వయంవరం మాట చెప్పినచో ఋతుపర్ణుడు రాగలడు. అతడు ముందురోజు సాయంత్రానికి చేరవలయునంటే అక్కడ ప్రచ్ఛన్నంగా ఉన్న బాహుక వేషంలోని నలుణ్ని తప్పక తీసుకువచ్చునని తలంపు గలిగి ఈ యుక్తిని నేనే చెప్పి చేయించితిని."

"ఆ దేవుడి కరుణవల్ల నే చేసిన యుక్తి యథార్థమై నా తలంపులు ఈడేరాయి. ఇలా మీ రాకను అపేక్షించి చేసిన నా పనికి అన్యథా వ్యాఖ్యానించక వాస్తవాన్ని యెరింగి నాపై కోపం వహించవలదని నా ప్రార్థన."

మనకు ఈ వియోగం సంభవించిననాటినుంచీ వ్రతధారిణినై జీవనార్థం మాత్రంగా ఆహారాన్ని తీసుకుంటూ మీరు చింపివేయగా మిగిలిన ఆ చీరను మాత్రమే ధరించుతూ మీ రాకకై రోజుల్ని లెక్కించుకొంటూ మిమ్మే హృదయంలో తలంచుతూ మీరు వస్తారు. మీ దర్శన భాగ్యం వల్ల నా జన్మ మళ్ళీ ఆనందభరితం కాగలదు అని ఆ కొన ఊపిరితోనే జీవించుతూ రోజులు గడుపుతూ వచ్చాను. ఈనాటికి ఇన్నేళ్ళు గడచిన తరవాత నేటికి భవదాగమనం మూలంగా నా పూర్వజన్మ పుణ్యపరిపాకం వల్ల మన సమా

గమం వాటిల్లింది. నా కష్టాలు అంతమైనా పుణ్యాలు పండి సుఖదినాలు వచ్చాయని సంతోషించుతున్నాను" అని నలుడి పాదాలు పట్టుకుంది.

దమయంతి ఇంకా అలా అంది. ఇందు నాకు దురుద్దేశ్యం ఎంతమాత్రం లేదు. ఇది ప్రమాణంచేసి చెబుతున్నాను. ఇందు పాప చింత కలిగి చేసినది ఉంటే రవిచంద్ర హుతాశనులు నన్ను హతమార్చి ఉందురు. ఈ నా మాటలకు నా వర్తనానికి వారే సాక్షులు. సంశయ రహితంగా సత్యాన్ని చెప్పా. ఇందలి వాస్తవాన్ని యెరిగి నన్ను స్వీకరించుడని నా ప్రార్థన అని దుఃఖాశ్రునయనయై భర్త సందేహాన్ని వారించుతూ ఉభయులను కలపమని వేయి దేవతలను ప్రార్థిస్తూంది.

## వాయుదేవుడు దమయంతి ఉత్తమురాలని చెప్పుట

ఇలా వాస్తవ విషయాలను చెప్తూన్న సమయంలో నలుడి సందేహాలను నివారించు రీతిని ఆకాశం నుంచి అశరీర వాణి అందరూ వింటూండగా "ఓయి! నైషధాధిపా! నేను వాయుదేవుడను నేను చెప్పుమాటలువిను. దమయంతి పుణ్య చరిత్ర. ఉత్తమ కథావతి. ఏపాటికూడా ఈమెయందు దోషం లేదు. అత్యుత్తమురాలు. ఈమె నారీరత్నం. ఈమెను తప్పుగా భావించువారిది తప్పు. అటు భానుడు అగ్ని

హోత్రుడు వాయువు మేం ముగ్గురం ఈమె చరిత్రాన్ని కని పెడుతూనే వున్నాము. ఈ ధన్యచరితురాలు. ఈమె వర్త నాన్ని సందేహించక ఈ పుణ్య చరిత పతివ్రత అయిన దమ యంతిని స్వీకరించు" అను మాటలు అందరి చెవిని పడినవి.

ఆకాశం నుంచి వినబడిన అశరీర వాక్యాలను విన్నా అందరూ దమయంతి పాతివ్రత్యాన్ని శ్లాఘించారు. ఆకాశం నుంచి పూలవాన కురిపించారు దేవతలు. వాద్యనాదాలు ఆకాశం నుంచి వినవచ్చాయి. అప్సరసలు దమయంతి ఉత్తమ చరితాన్ని కీర్తించారు. సుగంధ సహితంగా శీతల వాయువులు వీచసాగాయి.

వాయుదేవుడు దమయంతి పవిత్ర చరిత్రురాలని చెప్పి నందుకు ఆమె ఉత్తమ చరిత పతివ్రత పతిపూజాపరాయణు రాలు భర్తృప్రేమ భరితురాలని చెప్పగా విని నలమహారాజు ఆమెను తిరిగి భార్యగా గ్రహించాడు.

అనంతరం సంతోషాంతరంగుడై కర్కోటకుణ్ని స్మరిం చగా పూర్వం సర్పరాజు తీసుకుపోయిన వస్త్రం అతనియొద్దకు తిరిగివచ్చింది. చూస్తూన్న వారందరూ ఈ జరిగిన వస్త్ర సంఘటనను చూసి ఆశ్చర్యపడ్డారు. ఆ వస్త్రాన్ని నలుడు ధరించాడు. అలనాడు పక్షులు గొనిపోయిన నలుని వస్త్రం చేరగా దాన్ని నలుడు ధరించాడు.

నలుడా వస్త్రాన్ని ధరించగానే అతని శరీరంలోని కర్కోటక విష ప్రభావం ఉపశమించింది. దాంతో నలుడు దగద్ధగాయమానమైన నిజస్వరూపాన్ని పొందాడు. ప్రకాశ

మానమైన ముఖం, ఆజానుబాహు విగ్రహం స్ఫురన్నేత్రాలు కలిగి ఆనందదాయకమైన రూపంతో దేదీప్యమానంగా దర్శనం ఇచ్చాడు.

అతనియందు అన్ని శుభలక్షణాలూ కలిగి శాంత విగ్రహుడై అందంగా ఉన్నవాడై చక్కతనంతో వెలుగొందాడు.

అద్భుతంగా పూర్వ రూపాతిశయంతో ఉజ్జ్వలంగా విరాజిల్లుతూన్న నలమహారాజుని చూస్తూన్న దమయంతి ఆనందబాష్పాలతో ఆమెకూడా విలసిల్లింది. అట్టి అతన్ని చూడగానే దమయంతి అత్యంత పరవశురాలయి శోభిల్లింది.

ఈ సంఘటనను చూస్తూన్న బంధుమిత్ర పరివార జనాలు ఎంతో సంతోషంతో ముచ్చటపడ్డారు. అంతటి నుంచీ ఏ వైభవాలూ లేక పాడుబడ్డ రాజధానిలా వున్న విదర్భాపురం అంతా ఒక్కసారి ఆనందభరితమై వర్ధిల్ల సాగింది. మంగళగీతాలతో వాద్యనాదాలతో తోరణ పంక్తులతో ఉత్సాహం పరవళ్ళు తొక్కుతూ ఉప్పొంగి పోయింది.

రాజదుర్గం సకల శోభలతో ఒప్పారజొచ్చింది. దమయంతీ నలుల సమాగమంతో క్రొత్త శోభలు కనుపట్టాయి. వారిద్దరూ మలిన శరీరాలు వదలి శుభ్రమూర్తులయి విలసిల్లారు. సుగంధ బంధురమైన వస్తు వస్త్రాలంకారాలతో ఇనుమడించిన శోభలతో ప్రకాశించారు.

భీమరాజు సమస్త విచారాలు విడిచినందుకు ఎంతో సంతోషాతిశయంతో దర్శనం ఇచ్చాడు. అంతేకాదు. ధన కనక వస్తువాహనాదులను పంచిపెట్టాడు. విదర్భ రాజధాని అంతా సమస్త సంపదలతో అతిశయించింది. బ్రాహ్మణాదులకు అగ్రహారాలు దానాలు ఇచ్చి సకల సంతుష్టుల్ని చేసారు భీమరాజు దంపతులు.

## నల ఋతుపర్ణులు కలుసుకొనుట

ప్రేమ లోకంలో నల దమయంతుల గాధ అతి రమణీయమైంది. నలదమయంతులు విడిపోయినా వారి ప్రేమ మధుర గాధగా వారి స్మృతిపథంలోంచి అవిచ్ఛిన్నంగా ప్రవహించుతూనే వుంది. మధ్యలో వియోగంతో ప్రేమ గమనంలో చిక్కులు సంఘటిల్లినా ప్రేమబంధం వారిలో సుదృఢంగా నిలిచింది. వియోగానంతరం ఆ ఇరువురూ మళ్ళీ కలిసి మధుర జీవనంలో కాలు పెట్టిన శుభసందర్భంగా విదర్భాపురం పురావైభవంతో వెలుగొందజొచ్చింది. ఆ మహోత్సవాల కోలాహలం దశదిశలా విజృంభణంగా సాగుతూంటే ఋతుపర్ణుడు అందుకు కారణాన్ని తెలుసుకుని ఆశ్చర్యచకితుడయ్యాడు.

అనంతరం ఋతుపర్ణ మహారాజు ఒక శుభసమయం చూసుకుని చక్కగా ముస్తాబై బాహుక వేషం అంతా వదిలి రాజఠీవిలో ప్రకాశిస్తూన్న నలమహారాజుని చూడ్డానికి బయలుదేరాడు. ఋతుపర్ణుడు నలమహారాజుని దర్శించి చక్కని పద్ధతిగా ఇలా అన్నాడు. "ఓ నల సార్వభౌమా! నీవు

నిజంగా ధర్మమూర్తివి. అవక్రవిక్రముడవు. వీర్యమున ప్రచండ సూర్యుడు సాటి అయితే ఆహ్లాదకరణమునందు చంద్రునితో సమానుడవు. నిష్కళంక తేజో విరాజమాన పరిశుద్ధ యశశ్చంద్రికా శీతల శీతకిరణుడవు సకల సుగుణ శోభితుడవు. అట్టి నువ్వు గ్రహదోష కారణంగా ఆపదలకు గురై వికృతరూపం ధరించి పేరు మార్చుకుని బాహుక నామంతో నా కొలువులో వుండగా నిన్ను అటువంటి నిన్ను నీచ కార్యాలలో నియోగించి అజ్ఞానమత్తుడనయ్యాను. నా తప్పిదానికి నన్ను క్షమింప వేడుకొనుచున్నాను. నీ యెడల నే చేసిన తప్పిదాలుంటే నన్ను మన్నింపు మని నా ప్రార్థన" అని సవినయంగా చెప్పి నిల్చున్నాడు.

నలుడు బాహుక నామధేయంతో ఋతుపర్ణుడివద్ద పనివాడుగా ఒప్పుకొని జీతంతో మాయారూపుడై పనిచేయ నారంభించాడు. అలాగే చేసాడు. ఈ విషయంలో ఋతు పర్ణుడు దోషం ఇంత పిసరుకూడా లేదు. అయినా ఋతు పర్ణుడు తాను చేసినది తప్పేమోయని భయసంశయాలతో వున్నాడు.

నలుడాతణ్ని చూసి చిరునవ్వు ముఖంతో ఋతు పర్ణుణ్ని "రాజా ఆసనం స్వీకరింపుము. సుఖాసీనుడవగుము" అని ప్రథమంగా ఆ రాజుని కూర్చుండమని చెప్పెను. నలుని ఆజ్ఞ ప్రకారం "చిత్తంప్రభూ!" అని ఆ రాజు సుఖాసీను డయ్యాడు. అతన్ని చూసి నలుడిలా అన్నాడు.

"ఓ రాజా! దిక్కు తెలియక భార్యకు దూరమై రాజ్యం పోగొట్టుకుని దీనుడినై తిరుగుతూన్న వేళ నీ ఆస్థాన

మందు నాకు ఓ ఉద్యోగం కల్పించి సహాయం చేశావు. సంరక్షకుడుగా వున్నావు. రాజులకు వుండవలసిన సుగుణ సంపత్తి కలవాడవు. సత్పురుషుడవు. ఈ విషయంలో ఏ కొద్ది పాటీకూడా నీ దోషం లేదు. ప్రచ్ఛన్నంగా వున్న నాకింత నీడ చూపి రక్షించావు. సద్వర్తనం కలిగి నాకు నువ్వు చేసిన ఉపకారాన్ని నీ మంచినీ నేనీ జీవితంలో మరవలేను. ఇంకా నాయందు దయగొని అక్షహృదయం అను విద్యను ఉపదేశించావు. దాని ప్రభావం కారణంగా శని నన్ను ఎన్నో పాట్లు పెట్టి చాలా విధాలుగా కష్టాలకు నిలయం చేసాడు. అట్టి శని అక్షయ హృదయ విద్యా ప్రభావంవల్ల నన్ను విడనాడిపోయాడు. అందుచేతనే నా దుఃఖాలకి స్వస్తి పలికింది. మీరు ఉపదేశించిన అక్షహృదయం అనే విద్య ఇటువంటి సహాయకారివైన నిన్నేమని శ్లాఘించను. నీ మైత్రిని నీ ఉపకృతినీ మరచితినా నాకంటే అధన్యుడుండడు. నా పనివాని జీవితంలో నీ యెడ తప్పులను గణించను. నా యెడ నువ్వించుక కూడా ఏ తేడా గావించనూ లేదు. పైగా ఇంక ఇటుపై మనం ఇరువురం అత్యంత సన్నిహితులమై వుందాము." అని నలుడాతనితో అన్నాడు.

ప్రియంగాను యుక్తియుక్తంగానూ హితకరమైన నిషధాధీశుని వాక్యాలు విన్న ఋతుపర్ణుడు సంతోషపడినవాడై నలుడితో ఇలా అన్నాడు. "ఓ ఉత్తమ చరితుడా! ఉన్నతగుణ శోభితుడా! కష్టకాలం సంభవించినవేళ ఆ కష్టాలని ఎవ్వరైనా అనుభవింపక తప్పదు. కష్టకాలం దాపురించినప్పుడు దేవతలు కూడా తలవంచి అనుభవించారు. పడ

వలసిన పాట్లన్నీ పడినగాని దుఃఖాలు అంతంకావు. ఏ కొద్ది పాటి తప్పుకో ఇంత కష్టం అనుభవించావు. లేకపోతే నీ యంతటి మహానుభావునికి ఇంతటి కష్టం కలగడమా? నువ్వు సత్యపరాయణుడవు. ధర్మమార్గగామివి. పుణ్యశీలివి అయివున్నావు.

దేవతలు కూడా నీ ఉత్తమ గుణాలను మెచ్చుకొను వారే. నిర్మలమైన యశశ్చంద్రికలతో అలరారువాడవు. నీ ఉత్తమ గుణాలను పొగడగల శక్తి గలవాడను నే కాను.

నా విషయంలో నువ్వు చూపుతూన్న సౌహార్ధానికి నేనెంతో కృతజ్ఞుడను. నా యెడల సర్వదా ఇటువంటి మంచిని చూపుదువని నే ఆశించుచున్నాను" అని చాలా విధాలుగా నలమహారాజుని శ్లాఘించి అతని గుణం గానంచేశాడు ఋతు పర్ణుడు.

నైషధపతి అయిన నలమహారాజు ఋతుపర్ణుడు చూపిన మంచితనానికి వెరగంది నలుడాతనితో ఇలా అన్నాడు. "ఓ మహారాజ! ఇటువంటి ముదావహమైన సంతోష సమయంలో మీరచ్చట ఉండడం నా అదృష్టం. మీరు మా ఆస్థానమందు ఉండి మాచే అతిథి మర్యాదలను స్వీకరించుతూ ఇక్కడ మరికొంతకాలం వుండి మాకు సంతోషం కలిగింపవలయునని మా కోరిక" అనగా నలుడు అందులకు అంగీకరించి అక్కడవుంటూ పలు రాజ్య సభా కార్యక్రమాలలో పాల్గొంటూ వినోదాలతో కాలం గడు పుతూ కొన్నిదినాలు వున్నాడు.

ఆ విధంగా ఋతుపర్ణుడు విదర్భరాజునకు అతిథిగా వుండి అతని అతిథి మర్యాదలకు సంతృప్తి చెంది ఉంటూ ఒకనాడు నలమహారాజుని చూసి, "ఓ నలసార్వభౌమా! నేను నా రాజ్యాన్ని విడిచి ఇక్కడికి వచ్చి చాలాకాలం అయింది. మీ అతిథి మర్యాదలతోపాటు వినోద కార్యక్రమాలలో పాల్గొంటుంటే రోజులు ఇట్టే గడిచిపోయాయి. ఇక నా రాజ్యానికి పోయివత్తును. కాన నాకు సెలవియ్యండి. మీ అతిథి మర్యాదలు నాకు అపరిమితానందంగా ఉన్నాయి" అని అనగా నలమహారాజు విదర్భరాజు అనుమతితో ఋతుపర్ణుని ప్రయాణ సన్నాహం కావించాడు.

నల భీమరాజులు ఋతుపర్ణునికి సాదరంగా రథంపై వెడుతూండగా సైన్యంతో వీడ్కోలు చెప్పారు.

అయోధ్యాధిపతి ప్రయాణం అవుతూ వీడ్కోలు చెప్పవచ్చిన నలమహారాజుని చూసి "ఓయి! రాజశ్రేష్టుడా! మనము అయోధ్యనుండి విదర్భకు వస్తూన్న సమయంలో నీకు నేను అక్షహృదయం అను విద్యను ఉపదేశించాను. అప్పుడు నువ్వు నేను నీకు అశ్వహృదయం అను విద్యను ఉపదేశించుదునన్నావు కదా? అప్పుడు కార్యత్వరతనుబట్టి తరవాత ఉపదేశించుదువుకాని అని నేనన్నాను. నేనిప్పుడు మా దేశం పోవుచున్నాను. మళ్ళీ యెప్పుడుకలుసుకుంటామో తెలియదు. కావున ఎందుకైనా మంచిది. ఆ అశ్వహృదయం అను విద్యను నాకిప్పుడుపదేశించకోరుతున్నాను" అని ఋతుపర్ణుడు అడగ్గా నలుడు అందుకు సంతోషించి యథావిధిగా అశ్వహృదయమను విద్యనుపదేశించాడు.

అనంతరం నలభీమరాజు ఇచ్చిన అపురూపమైన కానుక లను స్వీకరించి వారి ఆజ్ఞతో ఋతుపర్ణుడు అయోధ్యకు వెళ్ళిపోయాడు.

ఋతుపర్ణుడు అయోధ్యకి ప్రయాణమై వెళ్ళిపోగా యిట నలుడు దమయంతితోనూ తన కుమార్తె కుమారు లతో గీతవిద్యాగోష్టి వినోదాలతో సంతోషంగా కొన్ని రోజులు గడిపాడు. ఇక తన అనంతర కరణీయంబు యోచింప దొడంగెను. "అత్తవారింట ఎక్కువకాలం ఉండదగదు. పైగా రాజ్యాన్ని పోగొట్టుకున్నాను. తిరిగి రాజ్యాన్ని నే పొందినగాని నాకు శుభంలేదు. కాబట్టి నిషధ దేశానికి పోయి ప్రస్తుతం నిషధరాజుగా చెలామణీ అవుతూన్న పుష్కర మాయావిని జూదంలోనో యుద్ధమందో ఓడించి నా రాజ్యాన్ని నా వశం చేసుకోవాలి. కావున విదర్భరాజుకి నా కోరికను చెప్పి అనంతర కర్తవ్యానికి ప్రయత్నిస్తానని ఆ విషయాన్ని గురించి అనేక రకాలుగా యోచించి తన మామగారయిన భీమరాజునకు తన కోరికను ఈ విధంగా తెలిపాడు.

"మామగారూ! అన్ని కష్టాలూ తీరాయి. కాని నా రాజ్యాన్ని నే తిరిగి పొందాలి కనక నిషధకుపోయి పుష్కరా ధముడి యుద్ధమో జూదమో ఆడి వానినుండి నా రాజ్యాన్ని నా హస్తగతం చేసుకుంటాను" అనగా భీమరాజు నలుడితో ఇలా అన్నాడు.

"ఓయి! రాజా! పుష్కరుడి నుంచి రాజ్యాన్ని స్వీకరించాలంటే అది అంత సులభమైన పనికాదు. దేనినీ కూడా పోగొట్టుకున్నంత సుళువుగా రాబట్టుకోలేము. పుష్కరుడితో జూదమాడాలో యుద్ధం చెయ్యాలో ముందు రెండింటిని గురించిన సాధక బాధకాలను పర్యాలోచించాలి. అసలు మొదటగా నిషధ దేశంలో పుష్కరుడి పరిస్థితి ఎట్లున్నదీ గూఢచారులవలన తెలుసుకుని ఆ తరవాత కర్తవ్యాన్ని నిర్ణయించాలి. అందుకోసం మనవద్దనున్న బుద్ధిశాలులైన గూఢఛారులను పంపి పుష్కరుడి రాజ్య పరిస్థితుల్ని తెలుసుకు రమ్మని నేడే గూఢచారులను ఆదేశిస్తా. వారివలన అక్కడి వార్తలు తెలుసుకుని కర్తవ్యానికి దిగుదువుగాని" అని చెప్పగా నలుడు అందులకు అంగీకరించాడు.

నలుడి కోరిక మేరకు విదర్భరాజైన భీమరాజు సమర్థులయిన గూఢచారులను నిషధ రాజ్యాన్ని గురించి పుష్కరుడి రాజ్యపద్ధతులను గురించి ప్రజల తీర్పును తెలుసుకొని రమ్మని పంపాడు.

భీమరాజు ఆదేశానుసారం చారులు నిషధ రాజ్యానికి పోయి అక్కడి పరిస్థితుల్ని క్షుణ్ణంగా రహస్య వేషధారులై తెలుసుకొనుటకు వెళ్ళారు.

గూఢచారులు నిషధ రాజ్యానికివెళ్ళి రహస్యవేషాలు ధరించి గ్రామాలూ పట్టణాలూ రాజధానితో కలుపుకుని జనపదాల్ని సంచరించి యథాపరిస్థితుల్ని గమనించి తిరిగి

వచ్చి నలునికి భీమరాజునకూ తమరుకనుగొన్న విషయాల నీ విధంగా వివరించారు.

## నిషధలోక విజృంభణ

మాయాజూదంలో పుష్కరుడు కలి ప్రేరణ వలన నలుని రాజ్యభ్రష్టుని చేసి ఆ సింహాసనాన్ని అధిష్టించాడు. రాజ్యాన్నంటే మాయతో పొదగలిగాడుగాని రాజ్యపాలన అనునది మంచి రాజులకు మాత్రమే తగిఉంది. అధముడు రాజైతే ఆ దేశ పరిస్థితులు అత్యంత భంగకరంగాఉంటాయి. పుష్కరుడిలాంటి ముష్కరుడు రాజ్యాన్ని ఎలా చేయ గలడు? నీచ పరిస్థితులలో ఆరితేరిన అధముడు పుష్కరుడు.

పుష్కరుడు రాజుకాగానే అధములందరూ వాణ్ని చేరి వాడికి తగిన చెడుగుణాలు ఉన్నవారిని ఎన్ని మంచి పదవులు సంపాదించి ప్రభువులూ సామంతులు కామందులూ అయికూర్చున్నారు. దాంతో రాజ్య పరిస్థితులు నిషధ దేశంలో తారుమారైపోయాయి.

అధములు ప్రభువులయి స్వార్థపూర్తికి తమ తమ గుణాలకి అనుగుణంగా రాజ్యాన్ని రాజ్యాంగాన్ని మార్చి పారేశారు. రాజ్యం అంతా దుష్టుల చేతుల్లోకి వెళ్ళి పోయింది.

ఈ అధములు వారెంత చెప్తే అదే రాజాజ్ఞ. అదే నాటి ప్రజాపంథా. ఈ అధమ అధికారుల మూలంగా రాజ్య పరిస్థితులు ప్రమాదస్థాయికి వచ్చాయి. శిష్టులందరూ

నోరు మూసుకోవలసి వచ్చింది. సత్యం న్యాయం ధర్మం పోయి కలి విజృంభణ విశృంఖలంగా చెలరేగింది.

నలుడి రాజ్యంలో కలి కామ క్రోధ లోభ మోహా లతో స్వైరవిహారం మొదలుపెట్టాడు. అదుపు ఆజ్ఞా లేదు. నలుడు అవలంభించిన రాజ్య సూత్రాలన్నీ మారిపోయాయి. ఇప్పుడు రాజ్యంలో నాలుగుసూత్రా లేఉన్నాయి. కామంఒకటి క్రోధం రెండు, లోభం మూడు, మోహం నాలుగు అనునవి.

వీటి ఫలితంగా వ్యభిచారులూ తాగుబోతులూ దొంగలూ స్వార్ధపరులూ వీధికెక్కారు. సత్యం, న్యాయం, ధర్మం మరియూ సదాచారం మరుగున పడిపోయాయి. అంత రించిపోయాయి. బూజుపట్టిన పనికిరాని చేతకాని వాని అప్ర యోజక వాక్యాలుగా మారాయి. అధములంతా అధికార్లుగా వచ్చారు. వీరందరూ అసత్యం, అన్యాయం, అధర్మం దురా చారాలలో కరడుకట్టుకుపోయిన దుష్టులు. ఈ రోజులు వీరికి మంచి వరంలా వచ్చాయి.

సత్సంబంధాలతో సంసారాలు సాగించే ప్రజలు ఒక సమస్య. దుష్టులు అధికారులయి రాజ్యాన్ని నడపడం ఇంకో సమస్య. ఇందు ప్రజల బ్రతుకులు శిష్టుల భోజనంలో కక్క ముక్కల్లా ఉంది. అటువంటి అధికారులతో ఇటువంటి ప్రజ లతో రాజ్యం వెర్రితలలు వేసింది.

ఎవరి ఇష్టం వారిది. దొంగతనాలకి న్యాయరక్షణ కలిగింది, అంటే న్యాయభక్షణ అన్నమాట. సత్యం ఆచ రించాలో అసత్యంగా ఉండాలో ప్రజలకి అర్ధంకావడం లేదు.

రాజ్యంలో ధర్మాసనం పంకిలమైపోయింది. దేవాలయాలలో పవిత్రతని తొలగించింది ప్రభుత్వం.

ఇక ప్రజలలో అలసత్వం, బాధ్యతా రాహిత్యం, అల్లరితనం, అయోమయ పద్ధతులూ అధికం అయ్యాయి. ఇంకో పేరు ఇంకో పేరుతో లంచగొండితనం పెరిగిపోయింది. సన్మానాలూ, సభలూ, బిరుదులూ పెరిగిపోయాయి. రాజ్యంలో వదంతులూ, నిందలూ, అపనిందలూతో వార్తా ప్రచారం కలుషితమైపోయింది. దండనీతి అసమర్థులతో అదుపుతప్పి వుంది. దొంగల కార్యాలయాలూ, జూద గృహాలూ, జూదశాలలూ విచ్చలవిడిగా పానశాలలూ అధికారుల ప్రచ్ఛన్నహస్తంలో నడుస్తున్నాయి. ప్రభుత్వంలో ఆడవారికి పెద్దపీట. ఒకచోట మూకుమ్మడి హత్యలు. ఇంకో చోట సామూహిక కామ సంబంధాలూ...అలా...అలా వుంది పుష్కర ప్రభుత్వం.

ఏదేనా అంటే ప్రస్తుత ప్రభుత్వ విధానం ఇది అన్న మాట వినబడుతూంటుంది.

తాతిగాడు గ్రామణి, తాతాలు మండలాధిపతి, మహామండలేశ్వరమహాసభాపతి మరాళి. మరాళి దీని రూపాంతరం మరిళి దీనికి మూలం మరిడి.

ఈ విధంగా పదాలనీ వుత్పత్తినీ చంచృతం అంటే సంస్కృతంలో మంచి పదాలుంటాయని సంస్కృతంలోకి మార్చుకున్న పేరు.

"ఏమయ్యా! ఇదేమిటయ్యా! నల మహారాజు రాజ్యంలో ఇలాగే వుండేదా అని అంటే అది నలమహారాజు రాజ్యం. ప్రస్తుతం ఇది నల్లమహారాజు రాజ్యం. ఫో అంతే!" అని ఇలా వుంది పుష్కరరాజ్య పరిస్థితి.

విదర్భరాజు పంపిన గూఢచారి సంస్థ అంతటా తిరిగి అన్ని రంగాలలోని తేడా పాడాలనీ కూలంకషం తెలుసుకుని మళ్ళా విదర్భకు చేరింది.

చారులు విదర్భకు పోయి నల భీమరాజులను ఏకాంతంగా కూర్చోబెట్టి అక్కడి విషయాలన్నింటినీ తమ అభిప్రాయాల టీకాటిప్పణులతో వివరించి చెప్పారు. చారులు వెళ్ళిపోయిన తరవాత అనంతర కర్తవ్యాన్ని గురించి నల భీమ రాజులు ఇద్దరూ యోచించారు.

"అదయ్యా! సంగతి." అన్నాడు నలుణ్ని చూస్తూన్న భీమరాజు.

"కాబట్టి" అని నలుడు భీమరాజుతో ఇంకా "నేను మామగారూ! యుద్ధానికి సిద్ధమౌతున్నాను. ఇంతకంటే సులభంగా ఈసారి అక్షక్రీడలో అక్షహృదయ ప్రభావంవల్ల పుష్కరుణ్ని ఓడించగలుగుతా. రెండింటికీ సిద్ధమై వెడతానండి" అని నలుడు అనగా ప్రయాణానికి ముహూర్తం నిర్ణయించి బయలుదేరుదువుగాని. ఈ లోపుగా పుష్కర రాజును గురించిన వార్తలు సేకరించువార్ని కూడా కలిసి ఇంకా వార్తలు తెలుసుకుందాం" అని నల భీమరాజులు తమ తమ స్థానాలకు వెళ్ళారు.

అనతికాలంలోనే పుష్కరుని వార్తలు సేకరించడానికి పంపబడ్డ ప్రత్యేక దూతలు వచ్చి పుష్కరుణ్ని గురించిన రహస్య సమాచారాన్ని నలునికీ భీమరాజుకీ చెప్పారు.

ఒక్కమాటలో పుష్కరుడి రాజ్య లక్ష్యాన్ని ఇలా చెప్పారు. "లోకంలో జన్మించిన మనుష్యులందరూ వాళ్ళ వాళ్ళ ఇష్టాన్ని అనుభవించడానికి పుట్టారు. కనక ఎవళ్ళ ఇష్టం వచ్చినట్లు వాళ్ళు ఈ లోకాన్ని అనుభవించడమే. బతకడానికీ రాజ్యానికీ లక్ష్యం అంటూ ఏమిటి. ఉచితంగా అంటే తేరగా చిన్న మాయతో గెలుపొందిన ఈ రాజ్యాన్ని రోజులు బాగున్నంతకాలం చిత్తుగా హాయిగా అనుభవించడమేనా ఇది" అని.

అనంతరం నలుడు ఒక మంచి ముహూర్తం చూసుకుని ఒక రథం, పదహారు ఏనుగులూ యాభై అశ్వాలూ ఆరువందలమంది సైనికులనూ తీసుకుని కొన్ని రోజులు ప్రయాణించి నిషధ దేశానికి చేరాడు. నిష్కంటకం నిశ్శాస్త్రవం అన్న ధీమాతో రాజ్యవైభవాలనూ సంపదలనూ భోగభాగ్యాలనూ చిత్తుగా అనుభవిస్తూ పుష్కరుడు రాజ్య మద మత్తుడై సుఖంగా గుండెలమీద చెయ్యి వేసుకుని నిద్రపోతున్నాడు.

"నలుడెక్కడ అతని రాక యెక్కడ? కష్టాల గాలి వానలో ఏ తీరానికో కొట్టుకుపోయిన వాడింకెక్కడ?" అని విధి విలాసాన్ని తప్పుగా అర్థంచేసుకుని అసలు ఆ ఆలోచనే లేక స్వేచ్ఛగా వున్న పుష్కరుడి దగ్గరకు వెళ్ళి పుష్కరుణ్ని

గురించి ప్రశ్నింప గొప్ప రాజ ఠీవి ననుభవిస్తూ ఉండడం చూసి నలుడు గర్జిస్తూ ఇలా అన్నాడు.

## రెండవసారి జూదంలో నలుడి గెలుపు

"ఓ పుష్కరా! వెనక నీతో జూదం ఆడి ఓడిపోయాను. నీ మాయ జూదం కారణంగా నే వ్యర్థంగా ఎన్నో కష్టాలనుభవించా" అనగా పుష్కరుడు "బాధపడకు ఆ సమయంలో ఆ సుఖాలు హాయిగా సరదాగా ఇప్పుడు నేను అనుభవిస్తున్నా. నీ ఖర్మం కాలింది. ఫో అలా అడివి లంపట పడి ఇంకా కొంతకాలం కష్టాలు పడకూడదూ?" అని అన్నాడు.

ఆ మాటలు విన్న నలుడు "మదాంధుడా! అనవసర ప్రసంగాలు కట్టిపెట్టి జూదం ఆడి నా రాజ్యాన్ని గెలుచుకున్నావు. ఇప్పుడు నీతో జూదం ఆడ్డానికి ఒచ్చా. ఇన్నాళ్ళూ ధనాభావంచేత పందానికి నే దిగలేకపోయా. ఇది కాదంటివా యుద్ధానికి దిగు. నిన్నిలా విడిచేవాణ్ని కాను. ఈసారి తాడో పేడో తేలుస్తా. ఈసారి రణరంగమో అక్షక్రీడయో తేల్చు" అని గద్దిస్తూ సభలో నలుడు కేకలు వేయగా పుష్కరుడు ఇలా అన్నాడు. "నీ భార్య తప్ప పందెం ఒడ్డడానికి నీవద్ద ఏం వుంది. పోపో" అన్నాడు.

అంత నలుడు "ఓరి మూర్ఖా! నువ్వు "ఫో" అంటే పోవడానికి రాలేదు. రాజ్యం వీర భోజ్యంరా. మాయతో రాజ్య సంపదలు స్వేచ్ఛగా అనుభవించజాలవు. అధిక

ప్రసంగించాలించి యుద్ధంచేసి గెలిచావా రాజ్యం శాశ్వతంగా నీది. లేదా జూదమాడి గెలిచావా అప్పుడుకూడా రాజ్యం నిశ్శాత్రవంగా నిష్కంటకంగా శాశ్వతంగా అనుభవించు దువుగాని. కాని ప్రస్తుతం యుద్ధం చేస్తావా కత్తిపట్టి? పాచక లాడతావా? ఏదో తేల్చి చెప్పు" అని పిరోత్సాహంతో యుద్ధావేశంతో గద్దించాడు నలుడు.

నలుడీవిధంగా అంటూంటే పుష్కరుడు విభ్రాంతుడై ఉద్రేకించిఉన్న నలుడికి ఏం సమాధానం ఇవ్వాలో ఎలా ఏం చెప్పాలో అర్థంకాక తటపటాయించసాగాడు. అప్పుడు పుష్కరుడిలా మనస్సులో తలపోసాగాడు. "ఇతను ఏదో గట్టి ప్రయత్నంతో వచ్చాడు. ఇప్పుడు వీనితో పోరో జూదమో ఆడితేనేకాని ఊరుకునేలా లేడు. ఇతనితో యుద్ధంచేసి గెలవటం అసంభవం. అంచేత జూదమే సుళువుగా వుంటుంది. జూదం ఆడే నలుడి సర్వ సంపదలనూ రాజ్యాన్నీ గెలిచా. ఇప్పుడువీనివద్ద ఒడ్డడానికిగలవిలువైనది అందాలరాశి ఇంద్రాదులకుకూడా వశంకాని అతిలోకసుందరి దమయంతిని ఒడ్డమని జూదంలో ఆమెను గెల్చుకుని అతులితభోగాలతో నిష్కంటకంగా రాజ్యాన్ని అనుభవిస్తా. మంచికాలంలో వచ్చిందే తక్కువ. యోగంలేని రోజుల్లో ఎంత పాకు లాడినా ఏం దొరకదు. వీడి దురదృష్టదేవత మళ్ళీ వీణ్ని నా వద్దకు పంపిస్తుండును. లేదా నా అదృష్టదేవత వీణ్ని నావద్దకు తీసుకువచ్చి వుండును. ఏమైతేనేం ప్రస్తుతం వీడితో జూదమే సర్వశ్రేష్టం" అని యోచించి "వీడు ఓడిపోయి

ఏదో నక్కా-శతో గెలుద్దామని వచ్చాడు. వెర్రిబాగులోడు. వచ్చాడుగదా మరోసారి బుద్ధిచెప్పి ఆ భార్యను కూడా గెలుచుకుని సర్వనాశనం చేసి పంపుతా. జూదం అంటే ఏంవిటో తెలిసికూడా మళ్ళీ వచ్చాడు" అని యెంచి జూదానికి కావలసిన ఏర్పాట్లు చేశాడు.

నలుడి రాజ్యం రానినాటి పుష్కరుడి దశ ఎలాంటిదో వాడు మరిచాడు. ఏ పరిస్థితులలో ఎవరి సహాయంమూలంగా రాజ్యాన్ని పొందాడో అది మరిచాడు. పుష్కరుడి ఉచ్ఛ దశ అయిపోయింది. పతన దశ వచ్చిందని యెరుగలేక ఈసారి జూదంలో అందాల దమయంతిని గెలుచుకోవాలని ఆలోచించుకుంటున్నాడు.

ఊరుకుని వున్న పుష్కరుణ్ని చూసి నలుడు ఇలా అన్నాడు. "ఏం పుష్కరా! జూదమా యుద్ధమా దేనికి సిద్ధపడుతున్నావు? ఇదమిత్థంగా ఓ మాట చెప్పు. అలా ఎంతసేపని ఆలోచిస్తావు. నేను దేనికైనా సిద్ధంగా వున్నా. ఈ రెండూ కాదంటావా ఈ రాజ్యాన్ని విడిచిపెట్టి వెంటనే ఇక్కడనుంచి వెళ్ళిపో అని తీవ్రంగా అంటూంటే "సరే జూదానికే ఒప్పుకుంటున్నాను" అనగా పాచకలను తెమ్మని జూదగృహంలో జూదం ఆడ్డానికి నలుడూ పుష్కరుడూ కూర్చున్నారు.

అప్పుడు పుష్కరుడు నలుణ్ని చూసి "ఓయీ రాజా! నేను నీతో ఒక్క ఆట మాత్రమే జూదం ఆడదలిచా. నేను ఇప్పుడు రాజకార్యాల్లో నిమగ్నుడనయి వున్నా. ఇప్పుడు ఆడవలసిన విధానం కూడా మొదటగానే చెప్తున్నా.

నీ భార్యను పందెంలో ఒడ్డుతున్నావు. అందుకు నేనంగీక రించుతున్నా. నే నోడిపోయానా సమస్త రాజ్యాన్నీ కోల్పో తాను. నీ పరంచేస్తా. నువ్వు ఓడిపోయావా దమయంతి నాది. ఈ విధానికి ఇద్దరం ఒడంబడాలి సుమీ" అనగా "సిద్ధం" అన్నంతనే అక్కడి రాజుల సమక్షంలో నలుడు పుష్కరుడూ క్రీడకు దిగారు. తమ తమ తెలివి కొలదీ పాచ కలను గలగలాడించుతూ మంచి రసకందాయానికి చేరేలా ఆట ఆడుతున్నారు.

ఇలా ఆ ఇద్దరు క్రీడాకారులూ నైపుణ్యం కొలదీ ఆడుతున్నారు. కాని అపజయ సూచకాలు పుష్కరుడివైపు కనబడుతున్నాయి. ఎంతో అక్షక్రీడలో సమర్థుణ్ని అని విర్రవీగిన పుష్కరుడు చిత్తుగా ఓడిపోయాడు. ఈసారి గెలుపు నలుడినే వరించినది. పుష్కరుడు పీచు పీచుమంటు న్నాడు. పుష్కరుడి మొహం అంతా ముచ్చెమటలు పోశాయి. పుష్కరుడు పాచికలాడ్డంలో కంగారుపడి పోయాడు. చివర ఆటలో కూడా "గెలుపు గెలుపు నలుని దే గెలుపు" అని అందరూ హోరుమని కేకలు మారుమ్రోగి పోయాయి.

అక్కడి రాజ మండలం నలుణ్ని చుట్టుముట్టి రాజ్య లక్ష్మి రాజా నిన్ను వరించినది. "జయూ! విజయీభవా" అంటూంటే పుష్కరుడు అవమాన భారంతో కుంగి పోయాడు.

ప్రజలంతా ఒక్కసారి నలునికి "జై" కొట్టి పుష్క రుణ్ని "ఛీ" కొట్టారు. నోట మాటలేక మొహంమీద

కత్తివాటుకి నెత్తురుచుక్క లేక డిల్లబోయి కూర్చున్న పుష్కరుణ్ని చూసి నలుడు ఇలా అన్నాడు. "పుష్కరా! గెలుపోటములు గాలిపాటు. సమర్థత రెండవ స్థానం. ఆనాడు మాయతో గెలుపు నీది. ఈనాడు న్యాయంగా గెలుపు నాది ఓటమి నీది. ఆనాటి నా పరిస్థితులు కాని, నీ పరిస్థితులు కాని వేరు. ఈనాటి నీ నా పరిస్థితులు వేరు. అలాగే జూద ఫలితాలు తారుమారయ్యాయి. నువ్వు ప్రభువవగానే నన్నూ నా భార్యనూ దేశంనుంచి బహిష్కరించావు. ప్రజలను కూడా మాకు సహకరించవద్దని హెచ్చరించావు. మాకుపకరించాలనుకున్న పట్నవాసుల్ని తీవ్రంగా దండిస్తానని బెదిరించావు. ఆనాటి శని నా పక్షాన్ని ఉండబట్టి నీ ఆట సాగింది. నీ ఆజ్ఞలు చెలామణీ అయ్యాయి. ఈనాడు ఆ గెలుపేది? ఆజ్ఞలేవీ? ఓడి మమ్మల్ని కరుణామతితో పంపవలసిందిపోయి మామీద వ్యర్థంగా కక్షపూనావు. ఈనాడు ఓడిపోయింతరవాత ఏం మిగుల్చుకున్నావు? నువ్వు రాజ్యంచేసి ప్రజల మన్ననలనూ సానుభూతినీ కోల్పోయావు. రాజ్యం చేకొనగానే మొదటగా నువ్వు జారీచేసిన ఆజ్ఞ మా కుపకరించినవారికి మరణదండన విధింపబడునన్నది. దాని వల్ల మేం యించుక కష్టాలపాలయ్యాంకాని నీకు లాభించినదేదీ లేదుకదా! ఈ సంవత్సరాలలో నీ పాలన ఇలాగే అధ్వానంగా చేసి ప్రజా ప్రియతను పొందలేకపోయావు. పుష్కరా! ఇప్పుడు నువ్వు నా చేతిలో ఓ దోమవో ఈగవో! నీలాంటి దుర్బుద్ధినే నాశ్రయించితే నా ఇష్టం వచ్చినట్లు నిన్ను నలిపేయగలవాడనే అలా చేయదలచుకోలేదు. నువ్వు నాకు పితృవ్య తనయుడవు. అందుచేత నీ తప్పిదాలన్నింటినీ

క్షమించి పొమ్మంటున్నాను.నీమీద ఏ ఆంక్షలూ విధించడం లేదు. నీ సరుకులు ఇంకా బంగారు వస్తువులు మొదలయినవి తీసుకుపో'' అని తీవ్రంగా శాసించాడు.

పుష్కరుడు మోయగలిగినన్ని విలువైన వస్త్రాలంకారాదులను తీసుకుని ప్రజలందరూ విరగబడి నవ్వుతూంటే మాటిమాటికీ వేలెత్తి చూపిస్తూ చెడుమాటలంటూంటే సిగ్గుతో తలవంచుకుని సందులంపట పడి పట్నంనుంచి బయటకు పోయాడు.

''పోలో'' మని జనులు చప్పట్లు కొడుతూండగా పుష్కరుడు దొంగ అంటూ దుష్టుడంటూ అరుస్తూంటే నడవలేక నడవలేక మోయలేక సరుకుల్ని మోసుకుంటూ మారిపోతూన్న విధి వైపరీత్యానికి చింతిస్తూ బాధపడుతూ ఈ మధ్యనే ఏనుగుపై అంబారీమీద కూర్చుని ఊరేగినవాడే ఇప్పుడు ఇలా ఒంటరిగా వట్టి వెధవలా పోతున్నాడు.

అప్పుడు అనుకున్నాడు ''ఏదో మంచి అంటూ ఆ పేరుతో వదలిపెట్టాడు. రెండు లెంపకాయలు కొట్టినా చేసేది లేదు. ఈడ్చి నాలుగు తన్నినా చేసేది లేదు. నాలుగు మాటలని పొమ్మన్నాడు'' అనుకొంటూ అతని పెద్దమనిషి తరహాని మెచ్చుకుంటూ పురందాటి వెళ్ళిపోయాడు.

పుష్కరుడు పురందాటి వెళ్ళగానే ప్రజలలో సంతోష కోలాహలం పరవళ్ళు తొక్కసాగింది. కొందరంటున్నారు ''పట్నానికి పట్టిన శని పీడ విరగడయింద''ని. మరికొందరు

"మంచికి మళ్ళీ రోజులు వచ్చాయ"ని పలురకాలుగా చెప్పుకుంటూ వీధులలో జయజయ ధ్వనులతో ప్రజలు తిరగడం మొదలుపెట్టారు. ఎప్పుడయితే ప్రజలంతా ఇలా జయ జయ ధ్వానాలు చేస్తూంటే ఇంకా పుష్కర నియుక్తులై పెద్ద పదవులలో వున్న మరిళి, తాతి మొదలయినవాళ్ళంతా తోక ముణిచి కోట గోడలు దూకేసి చాటుమాటుగా పుంత దోవలు పట్టి గబగబా పరిగెత్తుకుపోయి చీకటి ప్రాంతాల్లోకి పోయి తలదాచుకున్నారు.

నిషధ పురానికి పట్టిన చీడపీడలన్నీ పటాపంచలై పోయాయి. పుణ్యాత్ములు పురంలో సంచరించడం మొదలు పెట్టారు. ధర్మాత్ములు మళ్ళీ పంచీ ఖండువాలు ధరించి స్వేచ్ఛగా సంచరింపసాగారు. దేవాలయాలలో నయ కచ మకాలూ విష్ణు సహస్రనామ పూజలూ ఆరంభం అయాయి.

పట్నం అంతా నలుడి శుభపాలనను గురించి పలు రకాలుగా గానాలు వినవస్తున్నాయి. బూజుపట్టిన పాత తోరణాలన్నీ ప్రజలు తీసేసి కొత్త మంగళతోరణాలు కడుతున్నారు. రహదారులన్నీ సుజనులతో కలకలలాడుతున్నాయి. అంతటా వైభవంగా కనబడుతోంది.

దయాదానం ధర్మం మొదలయినవన్నీ చిగురించడం మొదలయింది.

పుష్కరుడి నిర్గమనంతో కాఠిన్యం నిర్దయ హింస పాపం పట్టుతప్పిపోయి ప్రక్కలకు పోయాయి. నలుడి రాకతో

ఉదయకిరణాల ప్రకాశాలు కనబడ్డాయి. దయా దానం ధర్మం శుభాలూ వెళ వెళ్ళాడసాగాయి.

ఇటువంటి వాతావరణం కనబడుతూంటే బ్రాహ్మణోత్తములు మంచి సుముహూర్తాన్ని నిర్ణయించి పెద్దలు సహాకరించగా సకల కోలాహలంతో రథంమీద నలుడు ఊరేగి సింహాసనం మళ్ళీ అధిష్ఠించాడు.

నలుడి సభాప్రాంగణంలో మహారాజులూ ప్రభువులూ సామంతులూ మంత్రులూ కూర్చుండియుండగా తొలిసారి కొలువుతీరాడు. ఎన్నో మంచి సందేశాలు ఇచ్చాడు. పుర ప్రముఖులు శుభాకాంక్షలు తెలిపారు. పలు వృద్ధ బ్రాహ్మణోత్తములు శుభాక్షతలు శిరస్సుపై చల్లారు. పుణ్యాంగనలు పేలాలూ పువ్వులూ నలుని శిరస్సుపై చల్లారు.

ఈ విధంగా నలుడు ఇంద్రుడు సుధర్మలో వున్న ఠీవిగా ప్రకాశించాడు.

అనంతరం ఊరంతా పలురకాల అలంకారాలతో వెలుగొందుతూంటే విదర్భపురంనుంచి దమయంతిని తన పుత్రీపుత్రులనూ రావించి ఆనందోత్సాహాలతో నలుడు ఉప్పొంగిపోయాడు.

దమయంతీ పిల్లలూ వస్తూంటే ప్రాసాదాలనుంచి పూలు పేలాలు పుణ్యస్త్రీలు జల్లుతూండగా పురవీధులగుండా వచ్చి నలుడు రాజలాంఛనాలతో స్వాగతం చెప్తూంటే శిరో గృహాలను దాటి అంతఃపురం చేరారందరూ.

ఎన్నో కష్టాలు పడిన తర్వాత తన ప్రాణపతి అయిన నలునికూడిన దమయంతి వేయిమంది దేవతలకు మ్రొక్కింది.

ఈ విధంగా రాజమందిరమేమి రాజధాని యేమి తిరిగి పురావైభవాన్నీ పొంది నిత్యోత్సవాలతో ఒక నెల ప్రకాశ మానంగా వెలుగొందింది.

నలుడు భార్యా పిల్లలతో కూడినవాడై అహింస, న్యాయం, ధర్మం, పాటిస్తూ దానాలు చేస్తూ యజ్ఞయాగాది క్రతువులతో దేవతలను సంతృప్తిపరుస్తూ బ్రాహ్మణులకు భూరి దక్షిణలిచ్చి వారి మంగళకరమైన ఆశీస్సులను గ్రహించుతూ బధిర పఙ్గ్వంధ భిక్షుక పరివ్రాజకాది భిక్షుపణకావ ధూత కాపాలికాద్య నాథులకు ఇష్ట మృష్టాన్నాలు పెట్టి తాను సంతుష్టి చెందాడు.

నలుడి రాజ్యం సుభిక్షమై ఈతిబాధలు లేకుండా సుఖ సంపదలకు తావలమై ఒప్పారింది. నలసార్వభౌముని కీర్తి ప్రతిష్టలు గ్రామాలలోనూ జనపదాలలోనూ పట్నాలలోనూ వ్యాపించి నలచక్రవర్తి రాజ్యం ధర్మరాజ్యంగా విరాజిల్ల సాగింది. భూమి సస్యశ్యామలమై పలురకాల పంటలతో విలసిల్లసాగింది.

తరులతా గుల్మాదులు ఫలపుష్ప పల్లవ భరితములయి శీతలమంద మారుతాలతో అందగించాయి.

అకాల మరణాలుగాని భ్రూణహత్యలూ శిశు మరణాలూ లేక గృహాలన్నీ సకాల సంపదలతో ప్రకాశవంతము లయినాయి.

ప్రజలందరూ అతిథి సత్కారాలు చేస్తూ హరికథా శ్రవణాదులతో దైవభక్తి ప్రభుభక్తి కలిగి ప్రజలు విశ్వాసనీయులై మెలగుతున్నారు.

ప్రజలింకా "ఇది నా దేశం వీరు నా ప్రజలు ఈ రాజ్యంనాది" అనే సదాశయాలుకలిగి ప్రజల సహకారభావం వర్తిస్తున్నారు.

ఇటువంటి ఉత్తమ శీల సంపద కలిగిన నలమహారాజు ధర్మవర్తన కలిగి యుండుటవల్ల మనుష్యులకేకాక దేవతలకందరకీ కూడా చాలా ఇష్టుడై హితకాముడైనాడు.

లక్ష్మీ సహితుడైన శ్రీహరి నలునికి ప్రత్యక్షమై కామిత వరాలను ప్రసాదించి ఏ బంధాలూ ఆ దేశమున ఉండకుండునట్లుగా సుదర్శన చక్రాయుధ చక్రాన్ని రక్షణకై నియోగించి అంతర్ధానం చెందినాడు.

అది లగాయతూ ఆ సుదర్శన చక్రం దుష్టులను శిక్షిస్తూ శిష్టులను రక్షిస్తూండడం చేస్తోంది. రాజులందరు అసూయా ద్వేషాలు మాని నలమహారాజు రాజ్యంచేస్తూంటే సద్భావం కలిగి ప్రవర్తించుతున్నారు. సమస్త భోగాలనుభవించుతూ తన ప్రజలను ప్రేమతో కాపాడుతూ తన దేశాన్ని మంచి మార్గంలో నడుపుతూ చక్రవర్తులలో రెండవవాడుగా ఎంచబడుతూన్న నల చక్రవర్తి మూడు లోకాలలో కీర్తి పొందిన అతనిరాజ్యంలో దుఃఖం బీదతన బాధలు లేకుండెను.

పుణ్యమూర్తి అయిన నలమహారాజు చరితాన్ని ఎవరు వ్రాసినా చదివినా లేక విన్నా శని బాధ కలగదు.

మరియు సర్వసంపదలూ కలుగుతాయి. మరియున్నూ అట్టి ప్రజలు అన్ని సుఖాలూ పొందుతారు. అంటూ బృహదాశ్వమునీశ్వరుడు పాండవాగ్రజుడైన యుధిష్ఠురుడికి నల చక్రవర్తి కథను వినిపించి ఇంకా ఇలా చెప్పాడు.

నలమహారాజు భూమిని పాలిస్తూండగా జరిగిన ఓ చిన్న సంఘటనాత్మక కథను చెప్తా విను. ధర్మమందు ఇచ్ఛకాల వారటువంటి కథలను వినడం చాలా మంచిది. నీకు ధర్మమందు ఇష్టం కనక ఆ కథను నీకు చెప్తున్నా విను.

నలుడు రాజ్యం యేల్తున్న కాలం ప్రాణులకుకాని జాతులకుగాని శత్రుత్వం వుండేది కాదు అని చెప్పానుకదా! అలా వుంటుండగా ఓనాడేం జరిగిందంటే ఓ పులి ఒహటి ప్రవాహ నదిలో నీరు త్రాగటానికి ఒచ్చి ప్రవాహానికి అవతల నీరు త్రాగుతోంది. ఆ సమయంలో ఓ మేక ఒగటి దాహంతో అక్కడికే వచ్చి నీళ్ళు త్రాగుతోంది. ఆ రెండు జంతువులూ ఒకదాని కొకటి సహజవైరం గలవి. అటువంటి సమయంలో పులి మేకతో అంది. ఓ మేకా! నేనెవ్వర్నో తెలుసా? నా ఘనతని ఇంచుకంత కూడా లెక్కచేయక గౌరవం వుంచక నన్నో ఓ సాధారుణున్నిలా తలచి భయం లేకుండా ఇంత సమీపంలో ఉండి నీళ్ళు త్రాగుతున్నావు. నేను నీకు శత్రువుగా తోచడంలేదా? ఔను తోచదు. ఇది నలచక్రవర్తి రాజ్యంకదా అని రెచ్చిపోకు. ఎంతకాలం నీకు ఇలా నడుస్తుందో చూస్తా. నలుడిలా ఎంతకాలం రాజ్యాం చేస్తాడు? మళ్ళా మామూలు కాలం రాకపోదు. పులుల్ని చూసి మేకలూ, పిల్లుల్ని చూసి ఎలకలూ, డేగల్ని చూసి

ఇతర పక్షులూ భయం లేకుండా ఇష్టం వచ్చినట్లు సంచరిస్తూ మా ఘనతని యెంచని రోజులే సర్వదా ఉంటాయని తలుస్తున్నావా? నిన్ను చూడగానే ఒక్కపెట్టున నీపై దూకి నిన్ను చంపి నీ మాంసాన్ని తిని నీ రక్తాన్ని త్రాగేసి ఉండేవాణ్ని. కాని యీ సమయం అందుకు అనువుగా లేదు. నలరాజ్యం అయిపోయింది. అంచేత బ్రతికిపోయావు. వెళ్ళు వెళ్ళు అంది. ఇలా పులి అంటూంటే వైరభావం పాటించని ఇక్కడ వ్యాఘ్రం అలా చేసిన ప్రసంగం తప్పుగా ఉండడం వల్ల వెంటనే విష్ణుచక్రం వచ్చి దాని పీకను కత్తిరించి వెళ్ళిపోయింది."

ఓ ప్రభూ! విన్నారు కదా నలమహారాజు ధర్మపరిపాలనా సమయం ఎలాంటిదో? నలుడి ధర్మపరిపాలనలో ధర్మం నాలుగు పాదాలా నడిచింది.

ఓయీ! ధర్మరాజ! నలుడి కష్టాలని గురించి తల్చుకుంటే నీ కష్టాలు అంతకుమించినవి కావుకదా!

"ఓ పాండవాగ్రజా! సమస్త భూమండల రాజ్యాన్ని విడిచి చుట్టాలకు దూరమై దారుణారణ్యాలలో ఈ ద్రౌపది అనుజులతో వన్యమృగాల మధ్య దినం ఓ గండంలా గడుపుతూండడం కష్టమే. కష్టాలు వచ్చినప్పుడు జాగ్రత్తగా కాలం గడపడంకంటే చేయదగినదేమీ లేదు. కొద్ది తొందరలోనే మిమ్ములను కష్టాలపాలు చేసిన దుర్యోధనాదులు పాపఫలాన్ని అనుభవిస్తారు"

చివరకు శత్రువులను జయించి సకల మహీరాజ్యానికి ప్రభువై సకల సుఖాలనూ అనుభవించుతావు" అని బృహదశ్వుడు చెప్పగా ధర్మజుడు విని అతనికి నమస్కరించిరి. ఆ మునీశ్వరుడు ధర్మరాజును దీవించి పాండవులు కొంత దూరం సాగనంపగా ఆ మునీంద్రుడు ముందుకు సాగిపోవుచుండగా పాండవులు తమ యరవుకి వచ్చి సుఖంగా ఉన్నారు.

అంటూ వైశంపాయనుడు జనమేజయునికి చెప్పగా సంతోషించాడు.

ఈ నలుని వృత్తాంతం కలి బాధ పోగొట్టునది. కాన చదవదగినది. ఈ సందర్భంలో చదవదగిన శ్లోకం యీ క్రిందిది.

కర్కోటకస్య నాగస్య దమయంత్యానలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలి నాశనమే.

రు. 25/- శ్రీ రస్తు

సంపూర్ణము